# జీవన్, హనుల పరిచయం : మనిషిని పోలిన జీవజాలం.

# డాల్ఫిన్ చేపల చేష్టలు.

డాల్ఫిన్ చేపలంటే మనిషికెన్నాళ్లనుంచో అద్భుతమనిపిస్తూనే ఉంది. అందుకు తగినట్లుగానే ఆ చిలిపి ప్రాణులు మనిషి స్నేహం సదా కోరుతూనే ఉన్నాయి. డాల్ఫిన్ చేపలు అతితెలివైన ప్రాణుల్లో కొన్నిటిగా శాస్త్రవేత్తలెందరో నమ్ముతున్నారు. మరికాకపోయినా మనిషంత తెలివైనవిగా. ఇవి చేపల రూపం ధరించి భూమికి బదులు నీటిని ఎన్నుకున్న మానవ ప్రాణులేనని ప్రాచీన గ్రీకు దేశీయులు నమ్మేవారు.



డాల్ఫిన్‌లు తమ తలపైభాగంలోని సంచి గ్రంథుల్లోనుంచి గాలి పంపడం ద్వారా రకరకాల శబ్దాలెన్నో చేస్తాయి. నుదుటిలో కొవ్వుతో తయారైన ఒక కటకం ద్వారా ఈ శబ్దాలు కేంద్రీకరింపబడుతాయి. కొలన్లో అటుమూల దూరంగా పడేసిన చిన్న రాతిముక్కనైనా సరే ప్రతి ధ్వనుల సహాయంతో చక్కగా కనిపెట్టగలవు డాల్ఫిన్‌లు.







డాల్ఫిన్ చేపలకు అద్భుత కృత్యాలు చెయ్యడం నేర్పవచ్చు. గెంతులు, దూకడాలు, గిరికీలు కొట్టడాలు, చకిలిబడడాలు లాంటివన్నీ- అప్పుడప్పుడు సంగీతం లయ కనుగుణంగా కూడా. ఇంకా పలక తెప్ప మీద కుక్కల్ని లాక్కెళ్లడం, అలాగే బాస్కెట్‌బాల్ ఆడటం లాంటివి కూడా!



అందులో 12 ఏళ్ల డా. స్పాక్ అనే డాల్ఫిన్‌కు పదేపదే బహుమతులియ్యవల్సిరావడంతో ఆయనకు అనుమానం వచ్చింది. డా. స్పాక్ చిత్తు కాగితాలన్నీ కొలన్లో ఓమూల జమచేసి కొద్ది కొద్దిగా తెచ్చి చేపల బహుమతులు గెలుస్తోందని కడకాయన కనిపెట్టేశారు. తన శిక్షకుడికే నేర్పడం మొదలెట్టిందన్న మాట ఆ డాల్ఫిన్!

మనుషులు దగ్గరగా ఉన్నప్పుడు డాల్ఫిన్ చేపలు నీటిలోనుంచి ముక్కులు పైకెత్తి శబ్దాలు చేస్తాయి. బహుశ అవి మనిషితో సంభాషించాలని చూస్తుండవచ్చు. వాటికి బదులు చెప్పగలగాలని వాటి భాష తెలుసుకునే ప్రయత్నం చేస్తున్నారు శాస్త్రవేత్తలు.

డాల్ఫిన్ శిక్షకుడొకాయన తన పెంపుడు డాల్ఫిన్‌లకు కొలనంతా శుభ్రం చేసే పని నేర్పాడు. నీళ్లలో నుంచి తెచ్చిన ప్రతి చిత్తుముక్కకూ ఆయన వాటికి చేపల బహుమానాలు ఇచ్చేవాడు.



లక్షలాది సంవత్సరాల క్రితం డాల్ఫిన్‌లు భూమిపై సంచరించేవి. కాలక్రమేణా వాటి శరీర నిర్మాణమంతా మారిపోయి అవి సముద్రం చేరుకున్నాయి.



జీవితబీమా అనేది మీ భవిష్యత్తును కాపాడుకోడానికి అతి సురక్షితమైన, అతి నమ్మకమైన మార్గం. దాన్ని గురించి తెలుసుకోండి.



## లైఫ్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా

# ప్రతిక్షణం ఫ్లాష్ తాజాదనంతో పొంగిపోతోంది.

ఎందుకంటే కేవలం ఫ్లాష్‌లోనే
ఇప్పుడు నీలాకాశం రంగు
నోటి శుద్ధకారిణి ఉంది కనుక




**ఫ్లాష్ బ్లూ టూత్ పేస్ట్**

**ఫ్లాష్ వాడండి, చిరునవ్వులు చిందించండి.**

ఫ్లాష్‌లోని నీలి రంగు నోటి శుద్ధకారిణి, మీరు పళ్లు బ్రష్ చేసుకోవడం ప్రారంభించిన క్షణం మీ నోటి గాలిని తాజాగా మారుస్తుంది, మీ నోరంతటినీ శుభ్రంగా, తాజాగా మిలమిలలాడేలా చేస్తుంది. సంపూర్ణమైన నోటి సంరక్షణలో, దాని ఉత్తమ నాణ్యతకు గాను వియన్నాలో ప్రపంచ సెలక్షన్ బహుమతిని ఫ్లాష్ గెలుచుకుందంటే మరి ఆశ్చర్యమేముంది? ఫ్లాష్ ఇచ్చే సంరక్షణ మీ ఆరోగ్యమైన చిరునవ్వును రోజురోజుకి మెరిపిస్తుంది.

everest/82/FL/81-tl

జెమ్స్‌తో పొదిగాగా నా నావ
పయనిస్తా దాన్లో అద్భుత లోకంలో
తెస్తానిక మరెన్నెన్నో జెమ్స్
నీకోసం నాకోసం మనకోసం



చేజిక్కించుకోండి ఆ మధుర క్షణాల్ని
చేజిక్కించుకోండి ఆ జెమ్స్‌ని !

క్యాడ్‌బరీస్
చాక్లెట్లు

పువ్వులన్నీ సుగంధాన్ని పంచుతాయి, క్యాడ్‌బరీస్ జెమ్స్ తియ్యదనాల్ని అందిస్తాయి.

OBM/8241



# చందమామ


సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి


ఈ నెల బేతాళకథ ["అరుగు మీద హనుమయ్య"] కు ఆధారం జొన్నలగడ్డ రామలక్ష్మి రచన. కొందరు వ్యక్తులు తమ అనుభవమే పరమసత్యం అనుకుని, దానికి అనుగుణంగా యితరులకు సలహా లిస్తూంటారు. తరచిచూడకుండా అలాంటి సలహాలు నమ్మితే రాగల ప్రమాదాలు ఏమిటో, "అటకకు నిచ్చెన" అన్న కథలో చూస్తాం.

## అమరవాణి

కృపణేన సమో దాతా, న కశ్చిత్ భువి విద్యతే,
అస్పృశన్నేవ విత్తాని, యః పరేభ్యః ప్రయచ్ఛతి.

[లోభిని మించిన దాత లోకంలో వుండడు! దాత ధనాన్ని తన చేతి మీదుగా దానం చేస్తాడు; లోభి మాత్రం ధనాన్ని తాక కుండానే పరులపాలు చేస్తాడు.]


సంపుటి 71 జూలై '82 సంచిక 1

విడి ప్రతి : 1-75 : : సంవత్సర చందా : 21-00


7




# ఉత్తమశ్రోత

అమరగిరి రాజైన కేశవవర్మ గొప్ప సంగీత ప్రియుడు. ప్రతి సంవత్సరం నవరాత్రి ఉత్సవ సమయాల్లో ఆయన గాయకులను ఆహ్వానించి, గాన సభలు జరిపేవాడు. అందులో అందరికన్న గొప్పగా విద్వత్తు చూపిన గాయకుడికి పెద్ద బహుమానంతో పాటు, ఘనంగా సన్మానం జరుపుతూండేవాడు.

ఒక సంవత్సరం నారాయణభారతి అనే పరదేశ గాయకుడొకడు ఉత్సవాలకు వచ్చాడు. కేశవవర్మకు గానసభల్లో పాడిన వారందరికంటే నారాయణభారతి సంగీతం అద్భుతం అనిపించింది.

రాజు నిండు సభలో అతడికి విలువైన బహుమతులిస్తూ, "మీరు చాలా గొప్పగా పాడారు. మీ పాట వింటూంటే నాకు మైమరపు కలిగిందంటే . నమ్మండి," అన్నాడు.

నారాయణభారతి రాజుకు తన కృతజ్ఞత చెప్పుకుని, "మహారాజా, అంతమంది జనం వున్న సభలో పాడుతున్నంతసేపూ, నన్ను ఒక సందేహం పట్టి పీడుస్తూనే వున్నది," అన్నాడు.

"ఏమిటా సందేహం?" అని అడిగాడు కేశవవర్మ.

"నా పాట వింటూంటే తమకు మైమరపు కలిగిందన్నారు. కాని, శ్రోతల్లో మీరు తప్ప, మరెవరికీ నా పాట ఆనందం కలిగించినట్టులేదు. వాళ్ళల్లో కొందరు, నే పాడుతున్న మాటే మరిచి గుసగుసలాడుకోవడం కూడా గమనించాను," అన్నాడు నారాయణభారతి.

రాజుకు తన పౌరుల్లో తనలాంటి సంగీత ప్రియులు లేరన్న సంగతి బాగా తెలుసు. ఇదే ఆయనకు ఎంతో నిరుత్సాహ కారణంగా వుండేది. ఇప్పుడు

గంగిశెట్టి శివకుమార్



పరదేశపువాడైన నారాయణభారతి మాటలు విన్న తరవాత ఆయనకు చాలా బాధ కలిగింది.

కళలపట్ల, ముఖ్యంగా సంగీతంపట్ల తన ప్రజలకు ఆసక్తి కలిగించడం ఎలా? ఈ సమస్యను పరిష్కరించడం గురించి రాజు దీర్ఘంగా ఆలోచించి, మరుసటి సంవత్సరం నవరాత్రి ఉత్సవాలకు కొంచెం ముందుగా రాజ్యంలో ఒక చాటింపు వేయించాడు. అదేమంటే, జరగనున్న నవరాత్రి ఉత్సవ సభల్లో గాయకుల పాట విని, అందరికన్న ఎక్కువగా ఆనందించే ఉత్తమశ్రోతకు వెయ్యి వరహాల బహుమానం యివ్వబడుతుంది.

తన మంత్రికి కూడా సంగీతమంటే, అంతగా యిష్టం లేదన్న నమ్మకంతో రాజు యీ చాటింపు విషయం ఆయనతో ముందుగా సంప్రతించకుండానే చేయించాడు.

మంత్రి యీ చాటింపు గురించి తన నౌకరుల ద్వారా తెలుసుకుని, రాజును చూడబోయి, "మహారాజా, ఉత్తమ శ్రోతకు తమరు యివ్వబోయే బహుమానం సంగతి యింతకుముందే విన్నాను. వెయ్యి వరహాలంటే మనకు ఏమంత పెద్ద మొత్తం కాదనుకోండి. నా భయమల్లా పాట వినడానికి వచ్చే అంతమంది జనంలో ఉత్తమ శ్రోతను గుర్తించడం చాలా కష్టసాధ్యమని," అన్నాడు.

"కష్టసాధ్యమైనా ఫర్వాలేదు. ఈ బహుమానం కారణంగా మన ప్రజల్లో సంగీతంపట్ల ఆసక్తి పెరిగితే అంతే చాలు," అన్నాడు రాజు.

ఉత్సవ దినం వచ్చింది. ఈ సంవత్సరం నారాయణభారతి రాలేదుగాని ఆయనకు సమ ఉజ్జీలయిన గాయకులు చాలామంది వచ్చారు.

రాజు సమక్షంలో ఒక ప్రసిద్ధ గాయకుడు పాడనున్నాడని తెలియడంతో, సభాప్రాంగణమంతా జనంతో క్రిక్కిరిసి పోయింది. గాయకుడు పాట ప్రారంభించి

ఒకటి, రెండు నిమిషాలు గడిచేసరికి జనంలో ప్రతి ఒక్కడూ తలలు ఊపుతూ, చప్పట్లు చరుస్తూ హర్షధ్వానాలు చేయసాగారు.

ఇది చూసి రాజుకు ముందు ఆశ్చర్యమూ, ఆ తరవాత విపరీతమైన కోపమూ కలిగాయి. తాను ప్రకటించిన వెయ్యి వరహాల బహుమానంకోసం ప్రతి ఒక్కడూ ఉత్తమశ్రోతగా నాటకమాడుతున్నాడన్న మాట. ఇలా అయితే పాటకచేరీ రసాభాస అవుతుంది!

రాజు పక్కనే వున్న మంత్రితో యిప్పుడేంచేస్తే బావుంటుందన్న విషయమై సంప్రతించాడు. మంత్రి దీనికి విరుగుడు తనకు తెలుసునని చెప్పి, సభికులతో, "మహారాజుగారికి ప్రతి ఏటా ఉత్తమ గాయకుణ్ణి ఎలా ఎన్నిక చేయాలో తెలిసినట్టే, ఉత్తమశ్రోతను కూడా ఎలా ఎన్నిక చేయాలో తెలుసు. కనక, గాయకుడు పాడుతున్నంతసేపూ సభికులెవరూ హర్షధ్వానాలు చేయడంగాని, తలలు ఊపడంగాని చేయగూడదు. అందుకు భిన్నంగా ప్రవర్తించిన వాళ్ళ తలలు ఎగిరిపోగలవు." అన్నాడు.

అటు తర్వాత గాయకుడి పాటకు సభికులు తలలూపడం మానారు. కాని, వాళ్ళల్లో ఒక్కడు మాత్రం తల ఊపుతూనే వున్నాడు.

మంత్రి అతడి కేసి కోపంగా చూస్తూ, "నీకు తల వుండడం యిష్టంలేదా ఏం?" అని అడిగాడు.

దానికి వాడు తొణక్కుండా, "తియ్యని సంగీతం వినబడుతూవుంటే, తన్మయత్వంతో ఊగని తల వుంటేనేం, పోతేనేం!" అన్నాడు.

మంత్రి, రాజు కేసి తల తిప్పి, "మహారాజా, మనకు ఈ సంవత్సరం సన్మానించదగిన ఉత్తమ శ్రోత లభించాడు!" అన్నాడు.

రాజుతోపాటు గాయకుడు కూడా ఆ ఉత్తమ శ్రోత కేసి చూస్తూ మందహాసం చేశాడు.





# రావలసిన బాకీలు

సుబ్బిశెట్టిది వడ్డీ వ్యాపారం. వెంకటశెట్టి అతని ఏకైక పుత్రుడు. అతడికి ఇరవైఅయిదేళ్ళు నిండగానే సుబ్బిశెట్టి, వ్యాపార బాధ్యతలను అతడి మీదే పెట్టాలనుకున్నాడు.

ఒక రోజున అతడు తను అప్పు యిచ్చిన వాళ్ళ పద్దులు కొడుకుకు చూపిస్తూ, ఎవరెంత చెల్లు వేశారో, యింకా ఎంత బాకీ వున్నారో వివరిస్తూ, హఠాత్తుగా ఆగి, "ఒరే, మనం వెంటనే బయలుదేరి సోమవరం వెళ్ళాలి," అన్నాడు.

అంత హఠాత్తుగా తండ్రి సోమవరం ఎందుకు ప్రయాణం కడుతున్నాడో వెంకటశెట్టికి అర్థంకాలేదు. ఆ మాటే తండ్రిని అడిగాడు. "సోమవరంతోపాటు మనం రామవరం కూడా వెళ్ళవలసి వుంటుంది. మనం తిరిగి ఊరు చేరేవరకూ, మన ప్రయాణం గురించీ, ఆ గ్రామాల్లో నేను ప్రవర్తించే తీరు గురించీ ప్రశ్నలడిగి నన్ను మాత్రం విసిగించకు," అన్నాడు సుబ్బిశెట్టి.

ఇద్దరూ సోమవరం చేరగానే సుబ్బిశెట్టి రామయ్య అనే మోతుబరి రైతు ఇంటికి వెళ్ళాడు. రామయ్య, సుబ్బిశెట్టిని చూస్తూనే, "ఏమండోయ్, శెట్టిగారూ! ఇలా దయచేశారేమిటి?" అని అడిగాడు.

"అంతగా విశేషం ఏమీలేదు. రామవరం పోతూ యిటు వచ్చాను. పనిలో పనిగా మీ బాకీ సంగతి కూడా కాస్త గుర్తు చేయదలిచాను. ఇప్పటికి మీరు నెలసరి వాయిదాల మీద చెల్లు వేసిన నాలుగు వేల వరహాల బాకీ పోగా, మీ బాకీ యింకా ఐదు వేల వరహాలుంది. మిగతా మొత్తం త్వరలో చెల్లు వేయడం బావుంటుంది," అన్నాడు సుబ్బిశెట్టి.

సుబ్బిశెట్టి మాటలకు రామయ్య కోపం తెచ్చుకుని. "శెట్టిగారూ, పెద్దతనం కొద్దీ

రాంబాబు

మీకు మతిపోతున్నట్టున్నది. ఇప్పటికి నేను నెలసరి వాయిదాల మీద ఐదు వేల వరహాలు చెల్లు వేశాను. ఇక నేను బాకీ వున్నది మూడు వేల వరహాలు మాత్రం. మరెవరిదో బాకీ నా నెత్తిన రుద్దాలని చూస్తున్నట్టున్నది!'' అన్నాడు.

సుబ్బిశెట్టి వెంటనే చిన్నగా చిటికె వేసి, ''అది పుల్లయ్యగారి బాకీ, పొర బాటున మీ బాకీగా చెప్పాను!'' అన్నాడు.

తరవాత తండ్రి, కొడుకులు రామవరం వెళ్ళారు. అక్కడ సుబ్బిశెట్టి, భీమయ్యా అనే రైతును కలుసుకుని, ''భీమయ్యా గారూ! మీ బాకీలో యింతవరకూ మీరు చెల్లు వేసింది రెండు వేల వరహాలు మాత్రం. మిగిలిన నాలుగు వేల వరహాలూ ఎప్పటికి ఇవ్వగలమంటారు?'' అన్నాడు.

భీమయ్య రుసరుసలాడుతూ, ''శెట్టి గారూ, నేనింతవరకూ మూడు వేల వరహాలు చెల్లు వేశాను. ఇక నేను, మీకు వడ్డీతో సహా మూడు వేల ఐదు వందల వరహాలు బాకీ వున్నాను. వచ్చే నెల ఒకే సారిగా ఆ బాకీ మొత్తం యిద్దామను కుంటున్నాను,'' అన్నాడు.

వెంటనే సుబ్బిశెట్టి, ''భీమయ్యగారూ! పొరబాటున మీకు, వీరయ్యగారి బాకీ మొత్తం చెప్పాను. మీ లెక్క సరైనదే,'' అని, కొడుకుతో ఇంటికి వచ్చేశాడు.

వెంకటశెట్టి తండ్రిని, ''మనకు ఎవరు ఎంత బాకీ వున్నారో, పద్దు చూడకుండా చిటికెలో లెక్కవేసి చెప్పే నువ్వు, అలా ఒకళ్ళ బాకీలు మరొకళ్ళకు చెప్పి గొడవ పడ్డావెందుకు?'' అని అడిగాడు.

సుబ్బిశెట్టి నవ్వుతూ, ''ఆ రామయ్యా, భీమయ్యల బాకీలకు సంబంధించిన పద్దు ఎక్కడో పోయింది. ఈ సంగతి వాళ్ళకు తెలిస్తే, వాళ్ళనుంచి దమ్మిడీ మనకు రాదు. అందుకే, వాళ్ళ నోటితోనే చెల్లు వేసిన మొత్తాల గురించీ, యింకా ఇవ్వ వలసిన బాకీ గురించీ తెలివిగా చెప్పించాను. నువ్వు త్వరగా మరొక పద్దు పుస్తకం తెరిచి వాళ్ళ బాకీలను గురించిన వివరాలు రాయి,'' అన్నాడు.






## 9

[శివదత్తుడు రహస్యద్వారం నుంచి పోతున్నప్పుడు, దాని రెండవ కొసను నరవాహనుడి సైనికులు ముట్టడించారు. ఆ ముట్టడిలో శివదత్తుడి అనుచరులు కొందరు మరణించారు. అప్పుడు శివదత్తుడు శత్రుముఖ్యుణ్ణి ఎదుర్కొని, అతణ్ణి చంపాడు. వాడు మరణించగానే, ధైర్యం కోల్పోయిన నరవాహనుడి సైనికులు దిక్కులు చూడసాగారు. తరవాత—]

మందరదేవుడు, శివదత్తుడి మాటలకు అడ్డువస్తూ, "శివదత్తా! అదృష్టదేవత మొదటినుంచీ, మిమ్ములను ఒక కంట కనిపెట్టి వున్నదనే నేను భావిస్తాను. లేకపోతే, మీరు యిన్ని ప్రమాదాలనుంచి బయట పడటం సాధ్యమయ్యేదికాదు," అన్నాడు.

శివదత్తుడు నవ్వి, "అందుకు సందేహం లేదు. రహస్యద్వారపు రెండవకొసను అంతమంది శత్రువులు చుట్టుముట్టి వుంటారని, నేనే మాత్రం వూహించలేదు. కాని అదృష్టవశాత్తూ నా కత్తికి వాళ్ళ ముఖ్యుడు ఆహుతి కాగానే, ధైర్యం కోల్పోయిన మిగిలిన నరవాహనుడి సైనికులను హతమార్చటం ఎంతోసేపు పట్టలేదు. కాని, పొదలమాటున నక్కుతూ ఒకరిద్దరు శత్రువులు పారిపోయారనేది, ఆ తరవాతగాని నాకు తెలియలేదు.



గుర్రం కింద పడిపోయిన శత్రు సైనికుణ్ణి బయటికి లాగించాను. గుర్రం మరణబాధతో అటూ యిటూ తన్నుకోవటంలో, అతడు కూడా దాని కాళ్ళ కింద పడి బాగా గాయపడిపోయాడు. కొన వూపిరితో వున్న అతడికి, యింత నీరు పోయించాను. సమరసేనుణ్ణి గురించి నేను తెలుసుకోవలసిన ముఖ్య విషయం అతణ్ణించి తప్ప మరెవరినించీ తెలుసుకోవటం సాధ్యం కాదు.

దాహం తీర్చుకుని, కాస్త స్వస్థతగా కనబడిం తరవాత ఆ శత్రుసైనికుడికి భయపడవద్దని చెప్పి, సమరసేనుడిని గురించి ప్రశ్నించాను. అతడు యిప్పుడు బతికి వున్నాడా లేదా? అదీ ఆ సైనికుణ్ణి నేనడిగిన ప్రశ్న.

మరణబాధ పడుతున్న ఆ సైనికుడు, నా కేసి దీనంగా చూస్తూ, "సమరసేనుడు చనిపోయి నాలుగైదు గంటల కాలమైంది: ఇప్పుడు నరవాహనుడు రాజు!" అన్నాడు.

"అయితే, యుద్ధంలో సమరసేనుడు గాయపడిన మాట నిజమేనన్నమాట?" అని అడిగాను.

"నిజం...." అంటూ అతడు నేల మీదకు ఒరిగి కళ్ళు మూశాడు.

"మహాసేనాని సమరసేనుడు మరి లేడు!" అన్న భావం నా గుండెలను కలిచినట్టయింది. అతడు మహావీరుడనిపించుకున్నాడు, వీరమరణం పొందాడు. అతడి ఆత్మకు శాంతి కలగాలని దేవదేవుణ్ణి ప్రార్థించాను.

ఇక ఇప్పుడు కర్తవ్యం ఏమిటి? కుండలినీదేవి కరుణవల్ల నేను అనుకున్న దానికన్న కొద్ది కష్టనష్టాలతోనే సారంగం నుంచి బయటపడగలిగాను. శత్రువులతో జరిగిన పోరులో, నా అనుచరులు ఆరుగురు మరణించారు. నేను తక్షణం ఆ ప్రాంతం వదిలి, అడవి లోపలి భాగానికి పారిపోకపోతే, నరవాహనుడి సైనికులు మరికొందరు అక్కడికి వచ్చే ప్రమాదం ఉంది.

నా అనుచరులందర్నీ ఒక చోట చేర్చి పరిస్థితి వివరించాను. ఈనాడు కాక పోతే, మరోనాడైనా, ఈ ద్వీపాన్ని వదిలి పోక తప్పదని వారందరూ అంగీక రించారు. సమరసేనుడి మరణం తరవాత, నరవాహనుణ్ణి ఎదిరించే శక్తి, యిక ఈ ద్వీపంలో మరెవరికీ లేదు.

మరణించిన నా అనుచరులు ఆరుగు రినీ ఒకే సమాధిలో పూడ్పించి, మిగిలిన వారితో దట్టంగా వున్న అడవి ప్రాంతానికేసి బయలుదేరాను. ఒకటి రెండు క్రోసులు అలా ప్రయాణించిన తరవాత, మాకొక కోయగూడెం కనిపించింది. సైనికదుస్తులతో, ఆయుధాలు ధరించివున్న మమ్ముల‌ను చూస్తూనే, ఆ గూడెంలోని పిల్లలూ పెద్దలూ పరుగెత్తుకుంటూ వచ్చి మా చుట్టూ గుంపుగా మూగారు.

"ఈ గూడెంలో మీ పెద్ద ఎవరు? ఆయనతో మాట్లాడవలసిన పనివుంది!" అని అడిగాను వాళ్ళను.

నాలుగైదు నిమిషాల్లో ఒక వృద్ధుడు మా దగ్గరకు వస్తూనే, "మీరెవరు? ఇక్కడికేం పని మీద వచ్చారు?" అంటూ నన్ను ప్రశ్నించాడు.

నేను, నా అనుచరులను చూపుతూ, "వీళ్ళందరూ బాగా దప్పిగొని ఉన్నారు. నిన్నటినుంచి భోజనం కూడా చేయలేదు.




ఇందుకు మీరేమైనా సహాయం చేయగలరా!" అని అడిగాను.

వృద్ధుడు నా మాటలు వింటూనే, తతిమ్మా కోయవాళ్ళకేసి చూశాడు. మరుక్షణంలో నా అనుచరులను ఒక్కొక్కణ్ణీ, ఒక్కొక్క కోయవాడు ఆహ్వానించి తన ఇంటికి తీసుకుపోయాడు. ఈ అడవి జాతుల అతిథి మర్యాదను చూసి నేను చాలా ఆశ్చర్యపోయాను. వృద్ధుడు నా వంక చూసి నవ్వి, "మీరు నా ఇంటికి రండి. మీ అన్నపానాదుల ఏర్పాటు నేను చూస్తాను," అన్నాడు.

నేను వృద్ధుడితో కలిసి, వాళ్ళ ఇంటికి వెళ్ళాను. ఒక అరగంట సేపటికల్లా,



15

నాకు సర్వభక్ష్యాలతో చక్కని భోజనం వడ్డించబడింది. నేను భోజనం చేసి లేచే వరకూ వృద్ధుడు నాతో ఏ రకమైన సంభాషణా చేయలేదు. కాని, అతడి నిప్పు కణికల్లాంటి కళ్ళు, నన్ను గుచ్చి గుచ్చి చూడటం గమనిస్తూనే వున్నాను.

''మేం కోయలం! ఈ ఘోరారణ్యాలే మా సర్వసంపదలూ! మా పూర్వులుగానీ, మా తరంవాళ్ళంగానీ ఏనాడూ ఏ రాజరికానికీ తల వొగ్గింది లేదు,'' అన్నాడు వృద్ధుడు.

ఆ మాటలకు, నేను తల వూపి ఊరుకున్నాను. అతడు చెప్పదలుచుకున్న దేమిటో నాకు సూచన ప్రాయంగా కూడా అర్థం కాలేదు.

''దేశంలో వస్తున్న ప్రమాదకరమైన మార్పులు మాకు అప్పుడప్పుడూ తెలుస్తూనే వున్నవి. మీలో కొందరు, మా యువకులకు పెద్ద పెద్ద ఆశలు చూపి తమ తమ పక్షాల చేర్చుకునేందుకు ప్రయత్నాలు కూడా చేశారు. కోయకుల పెద్దగా, నేను అలాంటివి సాగకుండా యింతవరకూ ప్రయత్నిస్తూ వచ్చాను. మీరు సైనిక దుస్తులతో యీ అటవీ ప్రాంతానికి రావటంలో వున్న ఉద్దేశ్యమేమిటి?'' అంటూ సూటిగా ప్రశ్నించాడు వృద్ధుడు.

అప్పటిగ్గాని అతడికున్న అనుమానమేమిటో నాకర్థమైందికాదు. అతడి అనుమానాలను తొలిగించాలంటే, అన్ని వివ



Telugu July F-2 A P. 14

రాలతో యదార్థమేమిటో చెప్పక తప్పదని నిశ్చయించుకున్నాను.

సమరసేనుణ్ణి గురించీ, అతడితో నాకు మంత్రాల దీవిలో పరిచయం అయిన తీరూ, ఆ తరవాత కుండలినీ ద్వీపంలో వచ్చిన మార్పులూ, చివరకు నరవాహనుడి దుష్టపాత్రా-అంతా నాలుగు మాటల్లో కోయకుల పెద్దకు వివరంగా చెప్పాను. అంతా విన్న తరవాత అతడు నాకేసి గుచ్చి చూస్తూ, ''మీరిప్పుడు రాజ్యాధికారాన్ని వశపరుచుకున్న వారికి శత్రువులన్న మాట!'' అన్నాడు.

''అవును,'' అన్నాను.

వృద్ధుడు తల వంచుకుని కొద్దిసేపు ఆలోచించి, ''ఐతే, మీరీ అడవి ప్రాంతాన్ని నివాసంగా ఏర్పరచుకుని, కొత్తగా రాజ్యం ఆక్రమించుకున్న ఆ నరవాహనరాజు మీద వీలు దొరికినప్పుడల్లా దాడి చేయాలని చూస్తున్నారా?'' అన్నాడు.

''నిజం చెబుతున్నాను, అలాంటి ఆలోచన నాకెంత మాత్రం లేదు,'' అని తక్షణం జవాబిచ్చాను.

నా జవాబు కోయకుల వృద్ధుడికి చాలా సంతృప్తి కలిగించినట్టుంది. అతడు నా దగ్గరకు లేచి వచ్చి, నా రెండు చేతులూ పట్టుకుని, ''నేను, నా ప్రశ్నలతో తమ కేమైనా కష్టం కలిగించి వుంటే క్షమించండి. మీరు ఈ ద్వీపం వదలి పోదలిస్తే, అందుకు అవసరమైన సహాయం నేను చేయగలను. నా కోర్కె ఒక్కటే: మీరు



ప్రశాంతంగా వున్న యీ అడవి ప్రాంతాన్నీ, మా జీవితాలనూ ఒడుదుడుకుల పాలు చేయవద్దని. మీరు ఎక్కడి నుంచి, ప్రస్తుత రాజ్యపాలకుల మీద ఏమాత్రం తిరుగుబాటు లేవదీసినా, అది మా ఆటవీ ప్రాంతాన్ని అల్లకల్లోలం చేస్తుంది!'' అన్నాడు.

ఆ రాత్రి నా అనుచరులందరినీ ఒక చోట చేర్చి ఉన్న పరిస్థితి వివరించాను. మేము ఈ అడవి ప్రాంతాన దాగి వున్నట్టు నరవాహనుడికి ఏమాత్రం తెలియనీయ కుండా, వీలుచిక్కగానే ఈ ద్వీపాన్ని వదిలిపోవటం క్షేమమని అందరూ అంగీ కరించారు. కాని, మేము తలచిన దొక టైతే, ఆ రాత్రి సంఘటిల్లిన పరిణామం మరొకటి.

ఆరుబయట చెట్ల కింద నేనూ, నా అనుచరులూ నిద్రకు ఉపక్రమించాం. మాకు కొంచెం ఎడంలో కొందరు కోయ యువకులు అడవి జంతువులు దగ్గరకు చేరకుండా ఉండేందుకు మంటలు వెలి గించి, వాటి చుట్టూ పడుకున్నారు. సరిగా అర్ధరాత్రి సమయంలో దూరంగా డప్పుల మోతలూ, ఒకచోట అడవి కాలుతున్న వెలుగూ కనిపించింది.

మాకు ఆశ్రయం యిచ్చిన కోయ గూడెం తృటికాలంలో నిద్రమేల్కొన్నది.



కుల పెద్ద అయిన వృద్ధుడు, యువకు లందరినీ డాలూ, బల్లేలతో సర్వసన్నద్ధం చేసి, గూడెం చుట్టూ కాపలా పెట్టాడు. వాళ్ళల్లో కొందరికి కాగడాలు యిచ్చి డప్పుల మోత వినబడుతున్న అడవి ప్రాంతానికి పంపాడు.

'' ఈ రణగొణ ధ్వని ఏమిటి ?'' అని నేను వృద్ధుణ్ణి అడిగాను.

అతడు తల వంచుకుని, '' ఏమైనా కావొచ్చు. ఏనుగుల మందల్లాంటివి గూడెం మీద పడి సర్వనాశనం చేస్తూండ వచ్చు. లేక మరే ఆటవికజాతి వాళ్లయినా మాకున్న కొద్దిపాటి ఆస్తిపాస్తులు - పశువులూ వాటిని దోచుకునేందుకు దాడి

వచ్చి వుండవచ్చు. కాని ఒకటి మాత్రం నాకు ఆశ్చర్యంగా వుంది!'' అంటూ కాలుతున్న అడవికేసి వేలు చూపెట్టాడు.

''ఇది నా కోసం, నా అనుచరులకోసం నరవాహనుడి సైనికుల దాడి కాదు గదా?'' అన్న సంశయం మెరుపులా నా హృదయంలో కదిలింది.

అంతలో నలుగురైదుగురు కోయయువకులు కేకలు వేస్తూ, మేం వున్న చోటుకు వచ్చారు. వాళ్ళ కులపెద్దను చూస్తూనే, ''మన గూడేల మీద సైనికులు పడి చేతికి అందినదల్లా సర్వనాశనం చేస్తున్నారు. వాళ్ళల్లో కొందరు పనిగట్టుకుని అడవికి నిప్పు ముట్టిస్తున్నారు,'' అంటూ చెప్పారు.

''ఇలాంటిది లోగడ ఎన్నడూ జరగలేదే? ఇంతకూ వాళ్ళకు కావలసిందేమిటి?'' అని ప్రశ్నించాడు కోయకుల పెద్ద ఆదుర్దాగా.

అంతలో మేం వున్న చోటుకు ఒక నరవాహన పక్ష సైనికుణ్ణి పెడరెక్కలు విరిచి కట్టి ఇద్దరు కోయ యువకులు తీసుకు వచ్చారు.

''అయ్యా, వీణ్ణి అడగండి. సంగతంతా చెపుతాడు. ఈ అడవి ప్రాంతమంతా వీళ్ల నాయకుడైన సుబాహుడిదట!'' అంటూ వాళ్ళు ఆ సైనికుణ్ణి వీపు మీద కర్రతో రెండు పోట్లు పొడిచారు.

కోయకుల పెద్ద నా వంక చూసి, తరవాత పెడరెక్కలు విరిచి కట్టబడిన సైనికుణ్ణి ఇలా ప్రశ్నించాడు: ''మా వాళ్లు చెపుతున్నది నిజమేనా? సుబాహు డనే మీ నాయకుడికి, యీ అడవి ప్రాంతమంతా ఎవరు కట్టబెట్టారు?''

''నరవాహన మహారాజుగారు, మా నాయకుడు యుద్ధంలో చేసిన సహాయానికి ఈ ప్రాంతమంతా దానం చేశారు. ఇక్కడ నివసించే పశువులూ, పక్షులూ, మనుషులూ అంతా నేటి నుంచి ఆయన ఆధీనం. మేం దీన్నంతా వశపరుచుకునేందుకే ఇక్కడకు పంపబడ్డాం!'' అన్నాడు సైనికుడు.

—(ఇంకా వుంది)






## అరుగు మీద హనుమయ్య

పట్టువదలని విక్రమార్కుడు చెటువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి, భుజాన వేసుకుని,-ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీలాంటి పట్టుదలగలవాళ్ళు, లోకంలో చాలా అరుదుగా వుంటారని నా నమ్మకం. స్వకార్యాలు సాధించుకునేందుకే కాక, పరులకు మేలు కలిగించే పనులు చేసేందుకూడా పట్టుదల అవసరం. కాని, మేలుపొందినవాళ్లు దాన్ని ఆట్టే కాలం గుర్తుంచుకుని, మేలు చేసినవాణ్ణి గౌరవిస్తారన్నది అంతటా నిజం కాదు. అలాంటి గుర్తింపు లేనందున మానసికంగా కుంగిపోయిన హనుమయ్య అనే ఒక పరోపకారి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ యిలా చెప్పసాగాడు :

## బేతాళ కథలు



కూర్చుని, వీధిలో వచ్చేపోయేవాళ్ళను చూస్తూండేవాడు.

హనుమయ్య ఇల్లు ఊరుకు మధ్యలో వున్నది. అందువల్ల వీధిలో ఎప్పుడూ జనం రద్దీగానే వుండేవారు. హనుమయ్య పడకకుర్చీలో కూర్చుని ఎవరినో ఒకరిని పలకరిస్తూండేవాడు. తీరుబడివున్నవాళ్ళు ఆగి, ఆయనతో కాసేపు కబుర్లాడి వెళ్ళే వారు. తీరుబడిలేనివాళ్ళు, ఆయన కేసి చూసి, ఒకసారి పలకరింపుగా నవ్వి వెళ్ళి పోయేవారు.

విశ్వనాథపల్లె అనే ఒక పెద్ద గ్రామంలో వున్న హనుమయ్యకు వారసత్వపు ఆస్తి చాలా వున్నది. ఆయనకు ముగ్గురు పిల్లలు. హాయిగా, ఏ చీకూచింతా లేకుండా జీవితం గడిచిపోతున్నది. తనకు ఉన్నంతలో పదిమందికీ సాయపడడం హనుమయ్యకు అలవాటు. ఆ విధంగా, ఆ ఊళ్ళో ఎందరో ఆయనవల్ల సాయం పొందారు.

హనుమయ్యకు ఏ పనీ వుండదు. పొలం పనులు చూడడానికి పాలేర్లున్నారు, వంట చేసిపెట్టడానికి భార్య వున్నది, ఇంటి పనులు చూడడానికి పనివాళ్ళు న్నారు. ఆయనకు బద్ధకం కూడా ఎక్కువ కావడంవల్ల, తన ఇంటి అరుగు మీద

ఒక రోజు హనుమయ్య అలాగే చంద్ర న్నను పలకరించాడు. వాడు ఎక్కడికో హడావిడిగా పోతూ, హనుమయ్య పిలుపు వినలేదు. చంద్రన్న, హనుమయ్య దగ్గిర పాతిక వరహాలు అప్పుతీసుకుని, ఆరు మాసాలయింది. ఇంతవరకూ ఒక్క వరహా కూడా అప్పు తీర్చలేదు. హను మయ్య తీర్చమని అడగనూ లేదు. ఎప్పుడు కనబడినా, ఒకసారి వినయంగా దణ్ణం పెట్టి మరీ వెళ్ళేవాడు. ఆ రోజు పిలిచినా పలకలేదు!

''మనుషులు కృతఘ్నులు. చేసిన మేలు యిట్టే మరిచిపోతారు!'' అను కున్నాడు, హనుమయ్య.

ఆ తరవాత కొంచెంసేపటికి వీధి చివర ఒక గుర్రపుబండి ఆగడం హనుమయ్య

చూశాడు. బండిలోంచి దిగిన వాళ్ళను హనుమయ్య దూరాన్నుంచే గుర్తుపట్టాడు; వాళ్ళు లక్ష్మి, ఆమె భర్త వీరన్నా!

లక్ష్మికీ, వీరన్నకూ పెళ్లి కుదిర్చింది హనుమయ్యే. వీరన్న తరఫు వాళ్లు కట్నం యింకా ఎక్కువ కావాలంటూంటే, హనుమయ్య కల్పించుకుని లక్ష్మి గుణగణాలు వర్ణించి, సంబంధం తప్పిపోకుండా చేశాడు.

లక్ష్మి కాపురానికి పట్నం వెళ్ళేరోజున హనుమయ్యతో, "మీ రుణం యీ జన్మలో తీర్చుకోలేను, బాబాయిగారూ!" అన్నది.

వీధి దాటి, సందు మలుపు తిరిగితే వాళ్ల ఇల్లు. భార్యా, భర్తలు కబుర్లు చెప్పుకుంటూ తన ఇంటి ముందుకు రాగానే హనుమయ్య, "ఏమే, లక్ష్మీ! ఇదేనా రావడం?" అని అడిగాడు.

లక్ష్మి, హనుమయ్యను చూడలేదు; అతడి పలకరింపూ వినలేదు. భర్తతో పాటు ఆయన ఇల్లు దాటి వెళ్ళిపోయింది. మళ్లీ హనుమయ్య మనసు చివుక్కుమన్నది. "చేసిన సాయం మనుషులెంత త్వరగా మరిచిపోతారు!" అనుకుని చాలా బాధపడ్డాడు.

మరి కాసేపటికి వీధిన పోతూ బడిపంతులు కనిపించాడు. పంతులుకు హనుమయ్య కారణంగానే, ఆ ఊళ్ళో ఆశ్రయం దొరికింది. కట్టు గుడ్డలతో పంతులు ఆ ఊరు వస్తే, హనుమయ్య





అతణ్ణి తన ఇంట్లోనే పుంచుకుని, అతడి చేత చిన్న వీధిబడి పెట్టించాడు. ఇప్పుడు పంతులు సొంత ఇల్లు కూడా కట్టుకున్నాడు. అందుకూ్కడా హనుమయ్యే కొంత సాయం చేశాడు.

"అగవయ్యా పంతులూ! ఏమిటా హడావుడి?" అన్నాడు హనుమయ్య.

పంతులు ఒక్కక్షణం ఆగి, "పండగ దగ్గర్లోనే కదండీ, హడావుడే మరి! మరెప్పుడైనా వచ్చి తమకు కనిపిస్తాను," అని వెళ్ళిపోయాడు.

"నాతో కాసేపు కబుర్లు చెప్పాలంటే, అందరికీ హడావుడే! పిలిచానన్న గౌరవమైనా లేదు," అని హనుమయ్య బాధపడుతూండగా, ఆ దారినే పోతున్న శెట్టి ఆగి, "దణ్ణాలు హనుమయ్యా, బాబూ!" అన్నాడు.

పొరుగూళ్ళో దివాళా తీసి, యీ ఊరు వచ్చాడు శెట్టి. హనుమయ్యే అతనికి డబ్బు సాయం చేసి, మళ్ళీ వ్యాపారం పెట్టించాడు. శెట్టికి జాతకం తిరిగింది, బాగా సంపాయిస్తున్నాడు.

"అలా కూర్చోవయ్యా, కబుర్లేమిటో చెప్పు!" అన్నాడు హనుమయ్య.

"కూర్చోగలగడం మీ బోటి వారికే చెల్లింది. కష్టపడందే మాకు రోజులెలా గడుస్తాయి, బాబూ. కనబడ్డారు గదా అని పలకరించాను, అంతే!" అని శెట్టి వెళ్ళిపోయాడు.

"వీడికి నా డబ్బు కావాలిగానీ, నాతో కొంచెంసేపయినా కూర్చుని మాట్లాడడానికి మాత్రం యిష్టముండదు," అనుకున్నాడు హనుమయ్య.

ఈ విధంగా హనుమయ్య ప్రతిరోజూ వీధి అరుగు మీద కూర్చుని, వచ్చే పోయే వాళ్ళను చూస్తూండడమూ, వాళ్ళు ఈయన సంగతి పట్టించుకోకపోవడమూ జరుగుతూండేది. దీన్ని గురించి బాధపడుతూ హనుమయ్య చిక్కిపోసాగాడు. వైద్యుడు వచ్చి చూసి, ఒంట్లో ఎలాంటి జబ్బూ లేదన్నాడు.

భార్య ఎంత అడిగినా హనుమయ్య తను యిలా కృశించిపోవడానికి కారణ మేమిటో చెప్పలేకపోయాడు. ఆవిడ పొరుగూళ్ళో వున్న తన అన్న రమణయ్యకు కబురు చేసింది. ఆయన వెంటనే బయలుదేరి వచ్చాడు.

"అన్నయ్యా, కొంతకాలంగా ఆయన బాగా చిక్కిపోతున్నాడు. జబ్బేమిటో వైద్యులకు అంతుపట్టటం లేదు," అని హనుమయ్య భార్య అన్నకు తన బాధ చెప్పుకున్నది.

రమణయ్య తెలివైనవాడు. ఆయన హనుమయ్యను ఎన్నో ప్రశ్నలు అడిగి చూశాడు; కాని జబ్బుకు కారణం అర్థం కాలేదు. ఆయన హనుమయ్య దినచర్య అంతా అడిగి తెలుసుకున్నాడు. హనుమయ్య వీధి అరుగు మీద కూర్చున్నప్పుడే, ఆయన మానసికంగా ఎంతో కుంగిపోతున్నట్టు రమణయ్య గ్రహించాడు.

ఆ మర్నాడు హనుమయ్యతోపాటే రమణయ్య వీధి అరుగు మీద కూర్చున్నాడు. హనుమయ్య వీధి వెంట వచ్చేపోయే వాళ్లను గురించి చెబుతూ, వాళ్లల్లో ఎవరెవరికి తానెంతగా సాయపడ్డాడో, అయినా వాళ్ళు తనంటే ఎంత నిర్లక్ష్యంగా వుంటున్నారో వివరించి, చాలా బాధపడిపోసాగాడు.



రమణయ్య చాలా తాపీగా, "బావా, నువ్వు చెప్పింది నిజమే! నువ్వంటే ఎవరికీ లక్ష్యం లేకపోవడానికి కారణం తెలుసా? ఈ ప్రపంచంలో బద్ధకస్తుణ్ణి ఎవరూ గౌరవించరు. నువ్వు, యితరులకు సాయం చేసే డబ్బు, నువ్వు కష్టపడి సంపాయించింది కాదు, వారసత్వంగా వచ్చింది. నీకు డబ్బు విలువ తెలియక యిలా సాయం చేస్తున్నావనుకునే వాళ్లు కూడా కొందరుండవచ్చు. కష్టపడి పని చేయడం అలవాటు చేసుకో," అన్నాడు.

హనుమయ్యకు బావమరిది సలహా నచ్చి వుండాలి. ఆ రోజు నుంచీ తన పనులు యితరుల మీద వదలక, తానే

స్వయంగా చేసుకోవటం అలవాటు చేసుకున్నాడు. రోజూ పొలం వెళ్ళి వచ్చేవాడు. ఉదయం నిద్ర లేచింది మొదలు, రాత్రి పడుకునేవేళ వరకూ ఏదో ఒక పని చేస్తూండేవాడు. ఇలా కొంతకాలం గడిచేసరికి హనుమయ్య ఆరోగ్యం కుదుటపడింది. ఊళ్లో తనపట్ల గౌరవం పెరిగినట్టు కూడా ఆయనకు తోచింది.

బేతాళుడు యీ కథ చెప్పి, "రాజా, హనుమయ్య నుంచి సాయం పొందినవాళ్ళ ప్రవర్తనపట్ల నాకు కొన్ని అనుమానాలు కలుగుతున్నవి. అతడి సోమరితనాన్ని, వాళ్ళెందుకు అంతగా పట్టించుకోవాలి? అతడి మంచితనాన్ని గుర్తించి గౌరవిస్తే సరిపోతుందిగదా? హనుమయ్య సోమరితనంవల్ల వాళ్ళకు కలిగిన హాని ఏమున్నది? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల బద్దలవుతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "హనుమయ్యపట్ల గ్రామ ప్రజలెప్పుడూ ఒకే అభిప్రాయంతో వున్నారు. ఆయన మంచితనం, దాన గుణం అంటే వాళ్ళకు చాలా గౌరవం వున్నది. ఆ సంగతివాళ్ళు, ఆయన పలకరించినప్పుడల్లా వ్యక్తం చేశారు. అయితే, హనుమయ్య అలా సోమరిగా అరుగుమీద కూర్చుని, తనకు తానై మానసికంగా కొన్ని చిక్కులూ, సమస్యలూ కల్పించుకున్నాడు. తీరుబడిగా కూర్చున్నవాడి మనసు చాలా ప్రమాదకరమైనది. అది మనసులో, లేని శత్రువులను సృష్టిస్తుంది. ఆ సంగతి గ్రహించడంవల్లనే, ఆయన బావమరిది అతణ్ణి అరుగుమీదినుంచి లేపి పొలం పనుల్లో, యితరత్రా పనుల్లో కాలం గడిపేలా చేశాడు. ఆ విధంగా హనుమయ్య తాను స్వయంగా కల్పించుకున్న మానసిక రుగ్మత నుంచి త్వరగా బయటపడ్డాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. -- (కల్పితం)





# తనదాకావస్తే!

కాంతయ్యా, కోటయ్యా యిరుగుపొరుగున నివసించే రైతులు. వ్యవసాయ పనుల దగ్గిరనుంచీ ప్రతి చిన్న పనిలోనూ ఒకరి కొకరు సహాయం చేసుకుంటూ కాలం గడిపేవారు. వారి స్నేహం, కలుపుగోలు తనం మొత్తం గ్రామానికే ఆదర్శ ప్రాయంగా వుండేది.

ఒకనాడు హఠాత్తుగా వాళ్ళిద్దరూ నోటికి వచ్చినట్టల్లా తిట్టుకుంటూ, జుట్టూ జుట్టూ పట్టుకోవడం అందరికీ ఆశ్చర్యం కలిగించింది. చూడవచ్చిన వారందరూ కలహ కారణం తెలుసుకునేందుకూ, యిద్దరినీ శాంతపరిచేందుకూ ఎంతో ప్రయత్నించారు.

ఎవరెన్ని శాంతవచనాలు పలికినా, కాంతయ్యా, కోటయ్యా తిట్టుకోవడం మానలేదు. చుట్టూ చేరిన గ్రామస్థులకు ఏం చేయాలో పాలుపోలేదు. ఇంతలో బారైన తెల్లని గడ్డంతో, ప్రశాంత వదనంతో ఒక వృద్ధుడు అక్కడికి వచ్చాడు.

ఆ వృద్ధుడి ఆకారం, ముఖవర్చస్సూ చూసేసరికి కాంతయ్యా, కోటయ్యా కళ వెళ పడ్డారు. ప్రశాంతంగా అర్ధనిమీలిత నేత్రాలతో తమవైపే చూస్తున్న ఆ వృద్ధుడికి ఇద్దరూ వినయపూర్వకంగా నమస్కరించి, కలహకారణం చెప్పసాగారు.

ఆ వచ్చిన వృద్ధుడు ఇద్దరినీ మాట్లాడ వద్దని చేత్తో ఆజ్ఞాపించాడు. తరవాత కాంతయ్యా, కోటయ్యల్నే కాక చుట్టూ చేరిన జనాన్ని కూడా వుద్దేశించి ఇలా అన్నాడు: ''మనుష్యులు ఒకరి మీద ఒకరు కోపగించుకోవడమే ఘోరం! కలహించుకునేవరకూ, తిట్టుకునేవరకూ పోవడమంటే ఘోరాతి ఘోరం! కలహ కారణం యేదో నాకు యెవరూ చెప్పనవసరం లేదు. ఏ పరిస్థితులలోనూ, ఎవరు

ఎంత కవ్వించినా, కనీసం కోపం కన పరచడం కూడా మానవలక్షణం కాదు!''

కాంతయ్యా, కోటయ్యే కాక అక్కడ చేరినవారంతా నిశ్చేష్టులై విన్నారు. నాలు గైదు క్షణాలు నిశ్శబ్దంగా గడిచినై. ఇంతలో ఒక యువకుడు జనంలో నుంచి వచ్చి ఆ వృద్ధుణ్ణి సమీపించి, ''అయ్యా! ఏ పరిస్థితుల్లోనూ కోపం రాకుండా వుండడం మానవుడికి సాధ్యమయ్యే పని కాదు!'' అన్నాడు.

వృద్ధుడు పెద్దగా నవ్వి, ''ఎందుకు సాధ్యం కాదు? నా విషయమే చెపు తున్నాను. ఎవరూ, ఏ పరిస్థితుల్లోనూ నాకు కోపం తెప్పించలేరు. మానవులే కాదు, ఆఖరికి దేవతలూ, రాక్షసులూ అయినా సరే!'' అన్నాడు.

అడ్డు ప్రశ్న వేసిన యువకుణ్ణి కోపంగా చూసి, వృద్ధుడికి నమస్కరించి జనం ఎటు వెళ్ళవలసినవాళ్ళు అటు వెళ్లారు. యువకుడు వృద్ధుణ్ణి సమీపించి, ''తాత గారూ!'' అన్నాడు.

''ఏమిటి?'' అన్నాడు వృద్ధుడు నవ్వుతూ.

''తాతగారూ!'' అన్నాడు యువకుడు.

''ఏమిటో చెప్పు?'' అన్నాడు వృద్ధుడు, ఈసారి నవ్వకుండా.

''తాతగారూ!'' అన్నాడు యువకుడు ఇంకొకసారి.

''ఏమిటో చెప్పరాదా?'' అన్నాడు వృద్ధుడు కోపంగా చూస్తూ.

''తాతగారూ!'' అన్నాడు యువకుడు తొణక్కుండా.

''ఓరి వెధవా! నీకేమైనా పిచ్చా?'' అన్నాడు వృద్ధుడు గుడ్లెర్రచేసి.

''తాతగారూ!'' అన్నాడు యువకుడు శాంతంగా.

''ఓరి, శుంఠా! నీ డొక్క చీలుస్తా వుండు!'' అంటూ వృద్ధుడు చేయెత్తాడు.

యువకుడు నవ్వి, ''ఏ పరిస్థితుల్లోనూ మనిషికి కోపం రాకూడదు!'' అన్నాడు.

వృద్ధుడు తల వంచుకుని తిరిగి చూడ కుండా వెళ్ళిపోయాడు.






# ఇంటికన్న గుడిపదిలం

రామన్నకు ఎంతో వాత్సల్యంగా చూసుకునే తల్లీ, తండ్రీ అనుకూలవతి అయిన భార్యా, ముత్యాల్లాంటి ముగ్గురు బిడ్డలూ వున్నారు. అతడు అన్ని విధాలా అదృష్ట వంతుడని అందరూ అనేవాళ్ళు. కానీ, అతణ్ణి గురించి ఇంట్లో వాళ్ళందరికీ చాలా కాలంగా చిన్న అసంతృప్తి ఒకటున్నది. రామన్నలో దైవభక్తి వున్న ఛాయలు కనిపించేవి కావు.

అతడు దేవుడున్నాడనడు, లేడూ అనడు. కాని, గుడికి రమ్మంటే మాత్రం రాడు. యీ విషయంలో తల్లీ, తండ్రీ చెప్పి చెప్పి విసిగిపోయారు. భార్య కాళ్ళా వేళ్ళా పడి వూరుకున్నది. పిల్లలు ఎంత బ్రతిమాలీ ప్రయోజనం లేకుండా పోయింది.

ఈ కారణం వల్ల, ఏవైనా పర్వదినాల్లో ఇంటిల్లిపాదీ గుడికి వెళ్ళినప్పుడు రామన్న ఒక్కడూ ఇంటికి కాపలా వుండడం మామూలైపోయింది.

ఒకసారి రామన్న కొడుకుక్కు పెద్ద జబ్బు చేసింది. ఎలాంటి మందులకూ జబ్బు లొంగిరాలేదు. ఇక అన్ని ఆశలూ వదులుకున్న సమయంలో రామన్న భార్య, కొడుక్కు జబ్బు నయమైతే, సకుటుంబంగా వచ్చి దేవుడికి అర్చన చేస్తానని మొక్కుకున్నది. ఆమె యిలా మొక్కుకున్న రాత్రే జబ్బు కాస్త తిరుగు ముఖం పట్టింది. కొడుకు పూర్తిగా కోలుకున్నాక, రామన్న భార్య, భర్తకు గుడిలో అర్చన గురించి చెప్పింది.

"ఎప్పటిలాగే, మీరంతా గుడికి వెళ్ళి రండి, నేను ఇంటికి కాపలా వుంటాను," అన్నాడు రామన్న.

"అలాగనకండి, దేవుడికి కోపం వస్తుంది. ఇంటిల్లిపాదీ కలిసి గుడికి వచ్చి

"వసుంధర"



అర్చన చేయిస్తానని మొక్కుకున్నాను,'' అని విచారంగా ముఖం పెట్టింది రామన్న భార్య.

''నాకా గుడీ, ఆ వాతావరణం అంటేనే చిరాకు. ఒక్క క్షణం కూడా అక్కడ కాలక్షేపం జరగదు,'' అన్నాడు రామన్న విసుగు పడిపోతూ.

ఎవరెంతగా చెప్పినా వినకపోయేసరికి రామన్న తండ్రి, కోడలితో, ''లాభం లేదు, మనం వెళదాం, అమ్మాయ్. ఇలాంటి మొండిఘటాన్ని తన దగ్గిరకెలా రప్పించుకోవాలో, ఆ దేవుడికి తెలియదని మనం ఎందుకనుకోవాలి!'' అన్నాడు కోపంగా.

రామన్నను ఇంట్లో వదిలి అందరూ గుడికి వెళ్ళిన కొద్ది క్షణాలకు, ఇంటికి సీతాపతి అనే బంధువు వచ్చాడు. ఈ సీతాపతి రామన్నకు దూరపు వరసలో మేనమామ అవుతాడు.

అయన ఇంట్లో రామన్న ఒక్కడే వుండడం చూసి, ''ఏరా, మిగతావాళ్లంతా ఏరీ? ఊళ్ళోలేరా ఏం?'' అని అడిగాడు.

అంతా గుడికి వెళ్ళారని రామన్న చెప్పాడు.

''మరి నువ్వు వెళ్ళలేదేం?'' అని సీతాపతి రామన్నను అడిగి, అతడు ఏదో జవాబు చెప్పబోయేంతలో, ''పోనీలెద్దూ, అంతకన్న పుణ్యం గిట్టుబాటయే పనినే చెబుతాను,'' అంటూ కింద పరిచివున్న చాప మీద కూర్చుని, సంచీలోంచి ఒక పుస్తకం తీసి, ''ఇది భగవద్గీత! ఇందులో మొత్తం పద్దెనిమిది అధ్యాయాలున్నాయి. మొత్తం శ్లోకాలు కంఠతా పట్టేశాను. అప్పజెప్పుకుంటావేమిటీ?'' అని అడిగాడు.

తప్పనిసరయి రామన్న పుస్తకం అందుకున్నాడు. పుస్తకం చాలా లావుగా వున్నది. పైగా, సీతాపతి ఒక్కో శ్లోకాన్నీ పాటలా సాగదీసి మరీ చదువుతున్నాడు. ఇలా అయితే ఆ పుస్తకం అప్పజెప్పుకోవడానికి రెండు రోజులైనా చాలవు.

కొద్దిసేపు జరిగాక రామన్న, ఊరికే పేజీలు తిప్పుతున్నాడు తప్ప, సీతాపతి చదివే శ్లోకాలు వినడంలేదు.

"ఏరా అబ్బాయ్, నువ్వు సరిగా అప్ప జెప్పుకోవడంలేదు. నిన్ను పరీక్షిద్దామని, కావాలనే ఇప్పుడు శ్లోకం తప్పు చదివాను; అయినా నువ్వు తప్పు పట్టుకోలేదు," అంటూ సీతాపతి రామన్నను మంద లించాడు.

"ఏమిటో, కళ్ళు మండుతున్నాయి, మామయ్యా! సరిగ్గా చూడలేకపోతు న్నాను," అన్నాడు రామన్న తప్పించుకో డానికి సాకుగా.



"అయ్యో, చెప్పావుకాదేం! నాకు కళ్ళ మంటలకు వైద్యం తెలుసు," అంటూ సీతాపతి రామన్నను పెరట్లోకి తీసుకుపోయి, రకరకాల మొక్కల ఆకులు తుంపి, అవన్నీ అరచేతిలో వేసు కుని నలిపి, "ఒక్క క్షణం కదలకుండా అలా కూర్చో, కళ్ళల్లో పిండుతాను," అన్నాడు.

ఆ రసంతో వున్న కళ్ళు కూడా పోతా యేమోనని రామన్నకు ఎక్కడలేని భయం వేసింది.

"వద్దు, మామయ్యా! ఈ ఉదయానే గ్రామవైద్యుడు నా కళ్ళల్లో ఏదో రసం పిండాడు. ఇదీ, అదీ కలిసి వికటిస్తుం దేమో అని నా భయం," అన్నాడు రామన్న.

"మరి, ఈ మాట ముందే చెప్పొద్దూ! అసలు నీకు మతిమరుపు జాస్తిలాగుంది. ఇంత చిన్న వయసులో అంత మతిమరుపు వుండకూడదు. దీనికీ వేరే పసర్లున్నాయి," అంటూ సీతాపతి మళ్ళీ పెరట్లో మరేవేవో ఆకులు తుంపసాగాడు.

ఇది చూసి రామన్నకు గుండె పీచు పీచుమన్నది. అతడు సీతాపతితో, "మామయ్యా, దేవుడంటే నీ అభిప్రాయం ఏమిటి?" అన్నాడు.

"దేవుడనేవాడున్నాడు! అయితే, కొందరు మూర్ఖులు ఆయన గుడిలో

మాత్రమే వున్నాడనుకుంటారు. నేను మాత్రం ఆయన ఎక్కడబడితే అక్కడ వున్నాడని నమ్ముతాను. అందుకే నేను దేవుణ్ణి ఎక్కడైనా ప్రార్థిస్తాను కానీ, గుడిలో మాత్రం ప్రార్థించను,'' అన్నాడు సీతాపతి.

''నిజంగా నువ్వు గుడిలో అడుగు పెట్టవా, మామయ్యా?'' అని అడిగాడు రామన్న ఆత్రుతగా.

''పొరబాటున కూడా అడుగు పెట్టను,'' అన్నాడు సీతాపతి.

అప్పుడు రామన్న గబగబా తన భార్య మొక్కను గురించి చెప్పి, ''వాళ్ళంతా నా కోసం గుడిలో ఎదురు చూస్తూంటారు, మామయ్యా. మేము తిరిగొచ్చేదాకా నువ్వు ఇంటికి కాస్త కాపలాగా వున్నావంటే, నీ రుణం యీ జన్మకు తీర్చుకోలేను,'' అంటూ సీతాపతి బదులు కోసం ఎదురు చూడకుండా పరిగెత్తాడు.

రామన్న గుడికి చేరుకునేసరికి, యింకా అర్చన ప్రారంభం కాలేదు. ఎందువల్లనో పూజారి రావడం ఆలస్యం అయింది. అతణ్ణి చూస్తూనే అందరూ ఆశ్చర్య పోయారు.

''ఏం చేయను మరి? ఇంటికన్న గుడే పదిలమనిపించింది,'' అంటూ రామన్న జరిగినదంతా చెప్పాడు.

''నే చెప్పలేదూ, ఆ దేవుడే వాణ్ణి తన దగ్గిరకు రప్పించుకుంటాడని!'' అన్నాడు రామన్న తండ్రి.

రామన్న ఎంతో భక్తి శ్రద్ధలతో ఇంటి వాళ్ళందరితోనూ కలిసి దేవుడి అర్చనలో పాల్గొన్నాడు.

ఇల్లు చేరగానే రామన్న తండ్రి సీతాపతితో, ''సీతాపతి బావా! ఈనాటినుంచీ పండగల్లోనూ, పర్వదినాల్లోనూ మా ఇంటికి వస్తూవుండు. నీ కారణంగా మా వాడికి దైవదర్శనమైనా అవుతూంటుంది,'' అన్నాడు.

ఆ మాటల వెనక వున్న రహస్యం ఏమిటో తెలియక సీతాపతి ఆశ్చర్య పోయాడు.





# కొండెగాడు

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలించే కాలంలో బోధిసత్వుడు మగధదేశంలోని ఒక గ్రామంలో మాఘు డనే క్షత్రియ కుమారుడుగా జన్మించాడు. ఆ గ్రామంలో యాభై గడప ఉండేది. యాభై యిళ్ళ మగవాళ్ళూ రచ్చపట్టులో సమావేశమవుతూండేవారు. ఈ గ్రామస్థులు నీతినియమాలు లేనివాళ్ళు. దొంగతనాలూ, హత్యలూ మొదలైనవి చేసి, లంచాలతో గ్రామాధికార్ల నోరు మూస్తూండేవాళ్ళు.

ఈ రచ్చపట్టుకు ఆలనాపాలనా లేదు. చెత్తాచెదారమూ ఉండేది. ఇది చూసి మాఘుడు తన కోసమని కొద్ది మేర శుభ్రం చేసుకున్నాడు. కాని ఆ ప్రదేశాన్ని మిగిలిన వారిలో ఎవరో కాజేసి స్వంతం చేసుకున్నారు. మాఘుడు మరొక జాగా శుభ్రం చేసుకున్నాడు. దాన్ని కూడా ఇంకెవరో ఆక్రమించుకున్నారు.

ఈ విధంగా మాఘుడు ఓపికతో రచ్చపట్టంతా శుభ్రం చేశాడు. ఆ తరవాత అక్కడ నీడగా ఉండేటందుకు ఒక పందిరి వేశాడు. ఇందువల్ల గ్రామస్థులందరికీ చాలా సుఖం చేకూరింది.

మాఘుడి ప్రవర్తన యాభై ఇళ్ళ మగవారినీ ఆకర్షించింది. వారంతా అతని నాయకత్వం ఆమోదించి గ్రామసేవలో నిమగ్నులయారు. అందరూ కలిసి సమావేశాలకోసం ఒక పెద్ద మందిరం నిర్మించి, తాగేటందుకు నీరు కూడా ఏర్పాటు చేశారు.

అదిమొదలు వారు మాఘుడి వద్ద పంచశీలాలు నేర్చుకుని సద్వర్తనులై మెలగసాగారు. వారు రోజూ రహదారులు చదును చేసేవారు. వచ్చేపోయే రథాలకు అడ్డంగా ఉండే చెట్ల కొమ్మలను నరికేవారు. గుంటలు పూడ్చేవారు, చెరువులు



అందుచేత ఆ అధికారి రాజుగారి వద్దకు వెళ్ళి, "మహారాజా, మా గ్రామంలో అరాజకం బలిసిపోయింది. మాఘుడనేవాడి ప్రభావంచేత ఊళ్లో ఉన్న యువకులందరూ అస్తమానమూ కర్రలు, గండ్రగొడ్డళ్ళూ, పలుగులూ పట్టుకు తిరుగుతున్నారు. ఏ రహదారి మీద చూసినా వీళ్ళే. వీళ్ళ మూలంగా ప్రజలకు చెప్పరాని ఉపద్రవం వచ్చి పడింది! ఏలినవారికి విన్నవించటం నా విధి! పైన తమ చిత్తం!" అని ఫిర్యాదు చేశాడు.

తవ్వేవారు, తేమ ప్రదేశాల మధ్యగా నడిచేటందుకు ఎత్తయిన కట్టలు వేసేవారు. వారికి మాఘుడు మార్గదర్శీ, నాయకుడూ అయాడు.

ఆ ఊరికి ఒక గ్రామాధికారి ఉన్నాడు. ఊళ్ళో వుండే యువకులు తాగుబోతులుగా, జూదరులుగా, హంతకులుగా, నీతిమాలి ప్రవర్తిస్తూ వున్న కాలంలో ఈ అధికారి సందు దొరికినప్పుడల్లా లంచాలు లాగీ, లంచాలివ్వని వారికి జరిమానాలు వేసీ, పుష్కలంగా సంపాదించాడు. కాని ఊరి కుర్రవాళ్ళకు మాఘుడు నాయకుడై, వారు సన్మార్గం అవలంబించిననాటినుంచీ గ్రామాధికారి సంపాదన సన్నగిల్లింది.

విషయం ఏమిటో తెలుసుకుని, అధికారి చెప్పినది నిజమైతే గ్రామస్థులందరినీ బంధించి తెమ్మని రాజు గ్రామాధికారి వెంట తగినంతమంది సైనిక భటులను పంపాడు. వారు గ్రామంలోకి రాకముందే, మాఘుడూ అతని అనుచరులూ వారికి రహదారిపై కనిపించారు. ప్రతి ఒకరి చేతిలోనూ కర్రో, పలుగో, గొడ్డలో ఉన్నది. మారుమాటలేకుండా సైనికభటులు వారందరినీ పట్టుకుని, పెడరెక్కలు విరిచికట్టి రాజుగారి ఎదుట హాజరు పెట్టారు.

రాజు వాళ్ళనూ, వాళ్ళ చేతుల్లో గల ఆయుధాలనూ చూసి, వాటిని వాళ్ళు గ్రామసేవకు వినియోగిస్తున్నారని గ్రహించలేక, గ్రామాధికారి చేసిన

ఫిర్యాదు రుజువైనట్టే ఎంచాడు. ఆయన వారిని విచారించకుండానే, "ఏనుగు పాదాల కింద ఈ దుర్మార్గుల నందరినీ తొక్కించి చంపించండి!" అని ఉత్తరు విచ్చాడు.

మాఘుణ్ణీ అతని అనుచరులనూ తొక్కించటానికిగాను పట్టపు టేనుగును అయత్తం చేసి తెచ్చారు. అది వారికి కొంత దూరంలో ఆగి, బెదిరిన దానిలాగా వెనక్కు తిరిగి పారిపోయింది. మరొక ఏనుగును తెచ్చారు. అదీ అలాగే పారిపోయింది.

ఈ వార్త రాజుకు అందింది. మూఢుడైన ఆ రాజు, "వాళ్ళ శరీరాల మీద తాయెత్తులూ, రక్షరేకులూ ఉండి ఉంటాయి. అందుకే ఏనుగులు వాళ్లని సమీపించలేకపోయాయి. వాళ్ళని పరీక్షించి అటువంటివేవైనా ఉంటే విప్పి అవతల పారేసి, మళ్ళీ ఏనుగులను పంపండి!" అని భటులను ఆజ్ఞాపించాడు.

కాని ఎవరి వంటి మీద కూడా ఒక తాయెత్తు కూడా లేదు. ఈ సంగతి విని రాజు, "ముద్దాయిలను నా వద్దకు పంపండి!" అన్నాడు. మాఘుడు మొదలుగాగల యాభైమందీ రాజు ఎదుట హాజరయారు.



"ఏనుగులు మిమ్మల్ని తొక్కటానికి ఎందుకు భయపడ్డాయి? మీరేదో మంత్రాలు చదువుతూ ఉండి ఉంటారు. నిజమేనా? మీకేమైనా మంత్రాలు వచ్చునా?" అని రాజు వారిని ప్రశ్నించాడు.

ఆ ప్రశ్నకు మాఘుడు ఈ విధంగా సమాధానం చెప్పాడు :

"మీరన్నది నిజమే, మహారాజా! మా దగ్గిర గొప్ప మంత్రం ఉన్నది. దాన్ని మించిన మంత్రం ప్రపంచంలో మరి ఒకటి లేదు."

"ఏమిటా మంత్రం?" అని రాజు ఆత్రంగా అడిగాడు.

"మాలో ఒక్కరు కూడా జీవహింస చెయ్యరు, ఒకరివ్వని వస్తువు తీసుకోరు, తప్పుడు ప్రవర్తనలకు దిగరు, అబద్ధా లాడరు; మేమెవరమూ మత్తు కలిగించే పదార్థాలు తాగము; మేము జీవులను ప్రేమిస్తాము, భూతదయ ఆచరిస్తాము; మేము దానాలు చేస్తాము, దారులు బాగు చేస్తాము, చెరువులు తవ్వుతాము, సత్రాలు కడతాము. ఇదే మా దగ్గిర ఉండే మంత్రం; ఇదే మా బలం," అన్నాడు మాఘుడు.

ఇది విని రాజు నివ్వెరపోయి, "ఇదే మిటి? మీరు దారులు కాస్తారనీ, మీదగ్గిర ఉండే ఆయుధాలతో ప్రజలను భయ పెట్టి డబ్బు దోచుకుంటారనీ విన్నానే? అవేమీ నిజం కాదా?" అన్నాడు.

"మీరు ఇతరులు చెప్పినది విని నమ్మారుగాని, నిజానిజాలు విచారించ లేదు," అన్నాడు మాఘుడు.

"మీరు పలుగులతో, గొడ్డళ్ళతో మా భటులకు దొరికారు. అందుచేత విచా రించటం అనవసరమనిపించింది," అన్నాడు రాజు, మరింత ఆశ్చర్యపడుతూ.

"అవి మేము వినియోగించే సాధ నాలు. రహదార్ల పక్కన ఉండే చెట్ల కొమ్మలు దారికడ్డంగా ఉంటే, గొడ్డళ్ళతో నరుకుతాం. చెరువులు తవ్వటానికీ, దారులు వెయ్యటానికీ, సత్రాలు కట్టటానికీ అవసరమైన పరికరాలు మా వెంట ఉంటాయి," అన్నాడు మాఘుడు.

ఇంత అయాక రాజు వారిని గురించి సరి అయిన విచారణ జరిపి, నిజం తెలుసుకున్నాడు. గ్రామాధికారి చేసిన ఆరోపణ అబద్ధమని రుజువయింది. ఆ అధికారి ఎన్నో ఏళ్ళుగా లంచాలు పట్టి సంపాదించిన సొత్తునంతటినీ రాజు ఈ యువకుల పరంచేస్తూ, "ఇకనుంచీ మీ గ్రామాన్ని మీరే ఏలుకోండి. నేను వేరే అధికారిని నియమించను," అన్నాడు.

వారిని తొక్కించటానికి తెప్పించిన పట్టపుటేనుగును కూడా ఆయన గ్రామస్థు లకు కానుకగా ఇచ్చి పంపేశాడు.





# బానిసవాడి అదృష్టం

ఢిల్లీని 1210 - 1236 మధ్యకాలంలో పాలించిన సుల్తాన్ ఇల్టమష్ ఒకసారి కొందరు బానిసలను కొనదలిచాడు. ఒక వర్తకుడు నూరుమంది బానిసలను తెచ్చాడు. సుల్తాను వాళ్ళల్లో తొంభై తొమ్మిదిమందిని కొని, బలహీనుడుగా కనిపించిన నూరవవాణ్ణి వద్దన్నాడు. వాడి పేరు ఉలుగ్ ఖాన్.

వాడు సుల్తాన్ పాదాల ముందు మోకరిల్లి, "ప్రభూ! ఈ బానిసలందర్నీ ఎవరి కోనం కొన్నారు?" అని అడిగాడు. నా కోసమే, అన్నాడు సుల్తాన్ ఇల్టమష్. "అయితే, నన్ను దేవుడి ప్రీత్యర్థం కొనండి!" అన్నాడు ఉలుగ్ ఖాన్. సుల్తాను నవ్వి, వాణ్ణి కూడా కొన్నాడు.





ఒకసారి సుల్తాను దర్శనానికి ఒక గొప్ప జ్యోతిష్కుడు వచ్చాడు. ఆయన ఇల్టమష్ చేయి చూసి, రాజ్యం అతడి తదనంతరం ఒక బానిస అధీనంలోకి పోతుందని చెప్పాడు. దానికి ఇల్టమష్ ఏమాత్రం తొణకక, "ఫర్వాలేదు. నా కొడుకుల్లో ఏ ఒక్కడూ బానిసవాడి కన్న వివేకవంతుడు కాదు. ఆ మాట కొస్తే, నేనూ ఒకప్పుడు బానిసనే!" అన్నాడు.



సుల్తాన్ ఇల్టమష్‌కు యీ జోస్యంలో అంతగా నమ్మకం లేకపోయినా, అతడి భార్యలకు మాత్రం గట్టి నమ్మకం కలిగింది. వాళ్ళల్లో ప్రతి ఒక్కరూ తన కుమారుడే సుల్తాను కావాలన్న పట్టుదలలో వున్నారు. సుల్తానుగా అదృష్టం పట్టనున్న బానిస ఎవడో ముందుగానే తెలుసుకుని, వాణ్ణి చంపించాలనుకున్నారు.

వాళ్ళు భర్తతో శతపోరి జ్యోతిష్యుణ్ణి మరొకసారి పిలిపించారు. సుల్తాన్ ఇల్టమష్ తన బానిసలందర్నీ, ఒక వరస క్రమంలో వచ్చి, జోతిష్యుడికి తమ చేతులు చూపించవలసిందిగా ఆజ్ఞాపించాడు. బానిసలు చాలా పెద్ద మొత్తంలో వున్నారు. జ్యోతిష్యుడు వాళ్ళ చేతులు జాగ్రత్తగా పరీక్షించి చూడడానికి చాలా కాలం పట్టింది.





అందరు బానిసలతోపాటు వరసలో నిలబడిన ఉలుగ్ ఖాన్‌కు దాహం వేసింది. అతడు చల్లగా అక్కణ్ణించి ఎవరూ గమనించకుండా తప్పుకున్నాడు. కాని, దాహం తీర్చుకుని అతడు తిరిగి వచ్చేసరికి సుల్తానూ, జ్యోతిష్యుడూ పని ముగించుకుని వెళ్ళిపోయారు. తక్కిన బానిసలు ఉలుగ్ ఖాన్ సుల్తాను కాగలడంటూ అతణ్ణి ఆటపట్టించారు.

కొన్ని సంవత్సరాలు గడిచాయి. ఉలుగ్ ఖాన్ విధినిర్వహణలో అప్రమత్తుడుగా వుంటూ క్రమంగా సుల్తాన్ ఇల్టమష్‌కు విశ్వాసపాత్రుడయాడు. సుల్తాను అతణ్ణి తన సర్దారులలో ఒకడుగా నియమించాడు. ఈ విధంగా దర్బారులోని నలభైమంది తురుష్క సర్దారులలో ఉలుగ్ ఖాన్ ప్రముఖుడు కావడం జరిగింది.






సుల్తాన్ ఇల్టమష్ మరణసమయంలో, తన కుమార్తె రజియాను ఢిల్లీ ఏలికగా నియమించాడు. కాని కొద్ది కాలంలోనే ఆమె హత్యకు గురైంది. సింహాసనం ఆమె సోదరుడైన నాజిరుద్దీన్ ఆక్రమించుకున్నాడు. అతడు అసమర్థుడని త్వరలోనే రుజువైంది. ఉలుగ్ ఖాన్ అతణ్ణి తన అల్లుడుగా చేసుకుని, సుల్తాన్ సంరక్షకుడుగా తానే పరిపాలనా బాధ్యతలు స్వీకరించాడు.

నాజీరుద్దీన్ అకాలమరణం పాలయాడు. అతడికి పిల్లలు లేరు. అతడి మామ అయిన ఉలుగ్ ఖాన్, ఘియాజుద్దీన్ బాల్బన్ అన్న పేరుతో ఢిల్లీ సుల్తానయాడు. ఈ విధంగా, అనాటి జోస్యం నిజమైంది!






బాల్బన్ సమర్థుడైన పాలకుడు. ప్రజలకు అతడి పట్ల గౌరవాభిమానాలుండేవి. మేవథులు అనే అతి క్రూరులైన దారిదోపిడి దొంగలను అరణ్యాల్లో వెంటదగిలి, నిర్దాక్షిణ్యంగా నిర్మూలించాడు. బెంగాలు గవర్నరు తుగ్రిల్ ఖాన్ తిరుగుబాటు చేయగా, అతడి మీద స్వయంగా దాడిచేసి చంపాడు.

బాల్బన్ పెద్ద కుమారుడైన ముహమ్మద్ ఖాన్ ముల్తాన్‌కు గవర్నరుగా వుంటూ సరిహద్దు రక్షణ చేస్తూండేవాడు. 1279 లో ప్రళయ భయంకరుడని పిలవబడే మంగోలుల నాయకుడు ఛెంగిజ్ ఖాన్ దాడికిరాగా, ముహమ్మద్ అతణ్ణి ఓడించాడు. ఛెంగిజ్ ఖాన్ తిరిగి మరొకసారి 1285 లో దాడి చేశాడు. అప్పుడు జరిగిన యుద్ధంలో ముహమ్మద్ మరణించాడు.





తన పెద్ద కుమారుడి మరణం బాల్బన్‌కు అంతులేని ఆవేదన కలిగించింది. ఆ దిగులుతో అతడు తన ఎనభయ్యో ఏట 1287 లో మరణించాడు. ఆ తరవాత ఢిల్లీ సింహాసనం కోసం అతడి మనుమలైన కైఖుస్రూ, కైకోబాద్‌లు కలహించారు. ఆ ఇద్దరినీ శత్రువులు హత్య చేశారు. ఈ విధంగా బానిసవంశపు సుల్తానుల పాలన అంతరించింది.



# బుద్ధిమాలిన సలహా

సుశీల మామగారు పరంధామయ్య చాలా ఉదారబుద్ధిగలవాడు. గ్రామంలో ఎవరైనా కష్టాల్లో వుండి సహాయం కోరి వస్తే, సాధ్యమైనంతలో డబ్బిచ్చి పంపుతూండేవాడు. అందరూ కాకపోయినా, వాళ్ళల్లో కొందరైనా పరిస్థితులు బాగు పడ్డాక తీసుకున్న డబ్బు ఆయనకు తిరిగి యిస్తూండేవాళ్ళు.

మామగారి ధోరణి సుశీలకు కంటగింపుగా వుండేది. ఆమె ఒకనాడు భర్త చంద్రయ్యతో, "మీ నాన్న అడ్డమైన వాళ్ళందరికీ డబ్బివ్వడం ఏమీ బాగా లేదు. ఇలా అయితే కొద్ది రోజుల్లోనే కొంప గుణ్ణమైపోతుంది," అన్నది.

"నాన్న నిజంగా కష్టాల్లో వున్నవాళ్లకే, ఏదో పాతికా పరకా యిస్తూంటాడు. మనిషన్నవాడికి ఆ మాత్రం ధర్మగుణం లేకపోతే ఎలా?" అన్నాడు చంద్రయ్య.

"ధర్మగుణం పేరుతో కుటుంబాన్ని దివాళా తీయించడం, నే నొప్పను. కావాలంటే మీ నాన్న, ఆస్తిలో మన భాగం మనకు పంచియిచ్చి, తనవంతు ఆస్తితో రోజూ ఊరంతకూ సంతర్పణలు చేసుకోమనండి," అన్నది సుశీల కోపంగా.

ఒక్కగానొక్క కొడుకైన తను, తండ్రిని భాగం పంచివ్వమని అడగడం బావుండదని చంద్రయ్య భార్యకు చెప్పి చూశాడు. కాని, ఆమె ఆ మాటలేవీ వినక రోజూ భర్తతో కీచులాటకు దిగసాగింది.

కొడుకూ, కోడలూ ఏదో గొడవ పడుతున్నారని తెలుసుకున్న పరంధామయ్య, ఒకనాడు చంద్రయ్యను ఒంటరిగా చూసి, సంగతేమని అడిగాడు. చంద్రయ్య అంతా చెప్పాడు.

పరంధామయ్య ఏమీ కోపగించుకోక, వారం తిరక్కుండానే ఉన్న పదెకరాల

శరత్



పొలంలో సగం కొడుకు పేరపెట్టి తను భార్యతో పక్క వాటాలో కాపరం పెట్టాడు.

సుశీల చాలా సంతోషించింది. నెల రోజుల తరవాత గురవప్ప అనే చంద్రయ్య స్నేహితుడు ఇంటికి వచ్చి, చంద్రయ్యతో, "మీ నాన్న ఎంతగా మారిపోయాడు! అవసరపడి పది రూపాయిలడిగితే, పది కాదుగదా ఒక్క రూపాయి కూడా లేదనేశాడు. తనలో వున్న కొద్దిపాటి దయాగుణం, తనను కొడుకు నుంచి వేరు చేసిందని కన్నీళ్ళు పెట్టుకున్నాడు," అన్నాడు.

ఇది విని చంద్రయ్య చాలా బాధపడి పోయాడు. సుశీల అతణ్ణి పక్కకు పిలిచి, "మీ నాన్నకు యిప్పటికి కాస్త లోక జ్ఞానం అబ్బిందన్నమాట! ఈ గురవప్ప మిమ్మల్ని డబ్బడుగుతాడేమో, చిల్లిగవ్వ యివ్వకండి. ఇలాంటివాటిల్లో మనం బంధువులూ, స్నేహితులూ అని కూచుంటే సర్వనాశనమైపోతాం," అన్నది.

"మా నాన్నకు యీ వయసులో లోక జ్ఞానం కలిగించిన దానివి, నువ్వు! అంతా నీ మహిమ," అన్నాడు చంద్రయ్య వెటకారంగా.

గురవప్ప మరికాసేపు కూర్చుని అదీ యిదీ మాట్లాడి, చంద్రయ్యను డబ్బడక్కుండానే వెళ్ళిపోయాడు.

ఆ మర్నాడు సుశీల తండ్రి రంగయ్య కూతుర్ని చూడవచ్చి, "నీ చెల్లెలు పెళ్ళి అనుకున్న ప్రకారం జరిగే యోగంలేదు. కట్నం సొమ్ములో రెండు వేలు కొరత పడింది. ఎక్కడా అప్పు పుట్టేలాలేదు," అన్నాడు.

సుశీల తండ్రికి ధైర్యం చెపుతూ, "ఆ రెండు వేలూ మీ అల్లుణ్ణడిగి తీసుకుని, రేపు సాయంకాలం వస్తాను. చెల్లెల్ని ఒకసారి చూడాలని వుంది," అన్నది.

ఆ రాత్రి సుశీల సంగతి చెప్పి, రెండు వేలు కావాలని భర్తను అడిగింది. చంద్రయ్య మండిపడుతూ, "ఇంతలోనే నీ

బుద్ధి మారిపోయిందా? డబ్బు విషయంలో స్నేహాలూ, బంధుత్వాలూ పాటించకూడదనేగదా, లోగడ నీవు చెప్పింది. ఆ మాట నమ్మే నేను, మా నాన్నను దూరం చేసుకున్నాను. మీ నాన్నకు సాయపడేందుకు రెండు వేలు కాదుగదా, రెండు రూపాయలిచ్చేందుకూడా నే నొప్పుకోను,'' అన్నాడు.

భర్త తన మొండిపట్టు వదలడని గ్రహించిన సుశీల, మర్నాడు పుట్టింటికి పోయి, తండ్రికి సంగతి చెప్పింది.

రంగయ్య పెద్దగా నిట్టూర్చి, ''ఎంతయినా, ఆ తండ్రి కొడుకేగదా !'' అన్నాడు.

ఆ మాటలు అర్థంకాక, సుశీల తండ్రికేసి ఆశ్చర్యంగా చూసింది.

''మీ ఆయన్ని, నే నేదో అనరాని మాట అన్నానని కోపం తెచ్చుకోకు. మీ మామగారు వేరుపడకముందు ఎంత ఉదారబుద్ధిగలవాడు ! అప్పట్లో, నీ చెల్లెలి వివాహం గురించి చెప్పి, కొంచెం డబ్బు అవసరం పడుతుందంటే, దానికేం బావగారూ - నాలుగైదు వేలు అవసరం అవుతుందా ? ఎప్పుడు కావాలంటే, అప్పుడు తీసుకుపొండి, అన్నాడు. కాని....'' అంటూ రంగయ్య కొంచెం ఆగాడు.

సుశీల ఆశగా, ''మరి, మామగార్నే అడిగితే సరిపోయేదిగదా!'' అన్నది.

''ఆ సంగతే చెప్తాస్తున్నాను! నెల రోజుల క్రితం మీ ఊరు వచ్చినప్పుడు, ఆయన దగ్గిర డబ్బు ప్రస్తావన తెచ్చాను.



ఎన్నడూలేంది గట్టిగా విసుక్కుంటూ, డబ్బు సాయం విషయం తన దగ్గిర ఎత్త వద్దన్నాడు. అంత జాలి గుండే, దయా గుణంగల మనిషి, యింతగా ఎందుకు మారిపోయాడు? బుద్ధిమాలిన సలహాలతో ఆయన్నిలా చేసింది, మీ ఆయనా, మరెవ రన్నానా?'' అని అడిగాడు రంగయ్య.

ఆ ప్రశ్నకు సుశీల గతుక్కుమని, ''ఏమో, నాన్నా!'' అంటూ తల పక్కకు తిప్పుకుని, కొంచెం ఆగి, ''నిజం చెపితే, చేసిన బుద్ధితక్కువ పనికి కాస్త ఊరటన్నా కలుగుతుంది. అప్పట్లో మామగారి ధర్మబుద్ధి నాకు అమాయ కత్వంగా, లోకజ్ఞానం లోపించడంగా కని పించింది. మీ అల్లుడితో పోరి వేరే కాపరం పెట్టించాను. అది మనకే యింత నష్ట కారణం అవుతుందని తెలియదు,'' అన్నది.

ఆ జవాబుకు రంగయ్య కూతురు కేసి చుర్రుమంటూ చూసి, ''తనదాకా వస్తే గాని తెలియదని పెద్దలు వూరికే అన లేదు! ఒకే మనిషి కొందరిపట్ల దాక్షిణ్యంగా, మరికొందరిపట్ల నిర్దాక్షిణ్యంగా ప్రవర్తించడం ఎలా సాధ్యం అనుకున్నావు? లోకజ్ఞానం లోపించింది నీకు. అందుకే, నేనూ, మీ మామగారూ కలిసి, మీ ఆయన స్నేహితుడు గురవప్పను మీ దగ్గిరకు పంపాం. గురవప్ప చెప్పింది విని, నువ్వు చాలా సంతోషించావు, అవునా? తీరా, నీ చెల్లెలు పెళ్ళి డబ్బులేక ఆగిపోతుందని తెలియగానే బాధపడిపోతున్నావు. మీ మామగారు, నేను కావాలన్న మొత్తం ఎప్పుడో యిచ్చేశారు. ఇక నుంచ యినా బుద్ధిమాలిన సలహా లివ్వడం మానుకో,'' అన్నాడు.

సుశీల బిక్కమొహం వేసి, ''నువ్వింతగా చెప్పాలా, నాన్నా! ఇంటికి పోతూనే, మామగార్నీ, అత్తయ్యనూ కాళ్ళావేళ్ళా పడయినాసరే, వేరు కాపరం వద్దని చెప్పి, ఒప్పిస్తాను,'' అన్నది.

''అది బుద్ధిగలపని. అలాగే చెయ్యి,'' అన్నాడు రంగయ్య సంతోషంగా.



# నేర్చిన విద్యలు

విజయనగరంలో ఒక వజ్రాలవ్యాపారి తన కొడుకు చిత్రగుప్తుడికి యుక్తవయసు రావడంతో వివాహ ప్రయత్నాలు ప్రారంభించాడు. నగరంలోని సాటి వ్యాపారుల కుటుంబాల్లో గల అందమైన. కన్యలను గురించి విచారించి, వారిలో అప్సరసలాంటి ముగ్గుర్ని ఎన్నిక చేశాడు.

చిత్రగుప్తుడు తండ్రి వెంట ఆ కన్యల గృహాలకు వెళ్ళి, ముగ్గురినీ చూశాడు. ముగ్గురూ అత్యంత సౌందర్యవతులే! కాని, చిత్రగుప్తుడి దృష్టి, ఆ కన్యలలో ఒకావిడ చెల్లెలైన భానుమతి అనే అమ్మాయి మీద పడింది. ఈ అమ్మాయి అక్కలాగా సౌందర్యవతి కాదు. కాని, వీణ అద్భుతంగా వాయిస్తుంది. కవిత్వం అంటే చాలా యిష్టం, వైద్యం కూడా నేర్చుకున్నది.

చిత్రగుప్తుడు తాను భానుమతిని పెళ్ళాడదలిచినట్టు తండ్రికి చెప్పాడు. తండ్రి ఆశ్చర్యపోతూ, "ఆ పిల్ల అంత అందంగా వుండదే!" అన్నాడు.

చిత్రగుప్తుడు ఒక క్షణ కాలం సంశయించి, "నాన్నా, మరేం అనుకోకు. అందం అనేది పుట్టుకతో వచ్చేది. దానికి తెలివితేటలూ, కృషీలాంటి వాటి అవసరంలేదు. కాని, భానుమతి స్వయంకృషితో వీణావాద్యం, వైద్యం నేర్చుకుని ప్రవీణురాలయింది. వయసుతో పాటు అందం హరించుకుపోతుంది. కాని, నేర్చిన విద్యలు మరింత రాణింపుకు వస్తాయి," అన్నాడు.

కొడుకు అంతర్యాన్ని గ్రహించిన తండ్రి, భానుమతితో అతడి వివాహం జరిపించాడు.

—మల్లాది వెంకటకృష్ణమూర్తి





# అటకకు నిచ్చెన

తనకు వున్న ఊళ్ళోనే మంచి సంబంధం కుదిరి, దుబారా ఖర్చులు లేకుండా పెళ్ళి జరిగిపోయినందుకు రవిరాం చాలా సంతోషించాడు. అతడి తోటి ఉద్యోగి అత్తవారి ఊరు చాలా దూరం. అందువల్ల పండగలకూ, శుభ కార్యాలకూ వెళ్ళి వచ్చినప్పుడల్లా, అతడికి చాలా డబ్బు ఖర్చయిపోతూండేది. ఆ కారణంగా అతడు ఎప్పుడూ ఏవో అప్పుల బాధల్లో వున్నట్టు కనబడేవాడు.

రవిరాం భార్య పేరు అనూరాధ. అతడు చిన్న ఇల్లొకటి అద్దెకు తీసుకుని, అందులో కాపరం పెట్టాడు. ఎప్పుడైనా అత్తవారింటికి వెళ్ళిరాదలిస్తే, అర్ధ రూపాయి బాడుగ బండితో ఆ పని జరిగిపోతుంది.

అతను యిలా కొత్త ఇంట కాపరం పెట్టాక, ఒకనాడు పొరుగింటి ప్రభాకరం వీధిలో ఎదురుపడి, 'నేను, మీ పొరుగింటివాణ్ణి. అయినా, అక్కడ కాక, యిక్కడ వీధిలో తారసపడి అడుగుతున్నాను! ఒక్క వంద రూపాయిలుంటే సర్దగలరా?'' అన్నాడు.

''తెలిసిందేగదా, నాది కొత్త కాపరం, ఖర్చులు జాస్తి!'' అన్నాడు రవిరాం.

అతడికి, ప్రభాకరం తనను అప్పు అడగడం ఆశ్చర్యం కలిగించింది. తన కంటే అతడికి జీతం ఎక్కువ. పైగా సొంత యిల్లు, పిల్లలు కూడా లేరు. అప్పు చేయవలసినంత అవసరం ఎందుకు కలిగింది?

రవిరాం యీ మాటే అడగగా, ప్రభాకరం నిట్టూర్చుతూ, ''బుద్ధి వున్నవాడెవడూ, ఉన్న ఊళ్ళో పిల్లను పెళ్ళాంగా తెచ్చుకోడు. నా భార్య పిండి వంటలూ, పప్పు ఉప్పులే కాదు, డబ్బు

మాచిరాజు కామేశ్వరరావు

కూడా పుట్టింటికి చేరవేస్తున్నది. మరి, నేను అప్పులపాలు కాక ఏం చేస్తాను? అన్నట్టు, మీ అత్తవారి ఊరూ యిదే కదా? ఇప్పటినుంచే కాస్త జాగ్రత్త పడడం మంచిది,'' అన్నాడు.

ఈ మాటలు రవిరాం నెత్తిన పిడుగుల్లా పడ్డాయి. ఇన్నాళ్ళుగా తను కొత్త కాపరం గనక ఖర్చులు పెరిగాయనుకుంటున్నాడు. అనూరాధ పుట్టింటికి ఏమేం చేరవేస్తున్నదో గమనించనేలేదు!

ఇలా ఆలోచిస్తూ యిల్లు చేరిన రవిరాం, ఆ సాయంత్రం అనూరాధ కొబ్బరికాయ కొట్టి పచ్చడి చేస్తూండడం చూశాడు. ఆమె పని ముగించుకుని పెరట్లోకి వెళ్ళగానే, పిల్లిలా పోయి పచ్చడి గిన్నె మూత ఎత్తి చూశాడు. అందులో ఒక కొబ్బరికాయకు సరిపడా పచ్చడి లేదు. మర్నాడు కందదుంప తెచ్చి భార్య కిచ్చాడు. ఆ కూర కూడా దుంపకు తగినంతగా లేదు.

భార్యపట్ల రవిరాం అనుమానం బలపడింది. రోజుకు ఒకటి, రెండుసార్లు అతడి బావమరిది ఇంటికి వచ్చి పోతూంటాడు. అనూరాధ తమ్ముడి ద్వారా తను పండినవన్నీ పుట్టింటికి పంపుతున్నదన్న మాట! తను ఇంట లేనప్పుడు ఆమె చేసే పనులన్నీ చాటుగా గమనించి, భార్యను నిలవదీయాలనుకున్నాడు, రవిరాం.



ఒకనాటి సాయంకాలవేళ అతడు భార్యతో ఉద్యోగం పని మీద పొరుగూరు పోతున్నట్టు చెప్పాడు. అనూరాధ తనకు సరిపడా వంట చేసుకునేందుకు వంట గదిలోకి వెళ్ళింది.

''నేను వెళుతున్నాను, వీధి తలుపు గడిపెట్టు!'' అంటూ వంటగదిలో వున్న భార్యకు కేకవేసి చెప్పి, రవిరాం చప్పున పోయి మధ్య గదిలో ఊరగాయల జాడీలున్న అటక మీదికి నిచ్చెన ఎక్కిపోయి కూర్చున్నాడు.

అనూరాధ నిజంగా భర్త వెళ్ళిపోయాడనుకుని వీధి తలుపు గడిపెట్టి, వంట గదిలోకి పోతూండగా, అటకకు ఆనించిన



నిచ్చెన కాలికి తగిలి పడబోయి, నిలదొక్కుకున్నది. ఆమె నిచ్చెనను తిట్టుకుంటూ, దాన్ని యివతలికి లాగి, గోడ వారగా చేరగిలవేసి వంటగదిలోకి వెళ్ళిపోయింది.

కొద్దిసేపటి తరవాత వీధి తలుపు చప్పుడైంది. "ఓహో, బావమరిదిగారు వేంచేశారన్నమాట!" అనుకున్నాడు రవిరాం కసిగా.

అనూరాధ, "వస్తున్నాను!" అంటూ వెళ్ళి తలుపు తెరిచి, మరుక్షణంలోనే, "బాడుగ బండి పిలుచుకురా," అంటూ ఇంట్లోకి వచ్చి, పొయి మీదినుంచి అన్నం పాత్ర దింపివేసి, పెట్టెలోంచి డబ్బు తీసుకుని, కొంగున ముడి వేసుకుని, వీధి తలుపుతాళం పెట్టి వెళ్ళిపోయింది.

"అనుమానించినదంతా అయింది! తమ్ముడు రాగానే, డబ్బు మూటగట్టుకుని బయలుదేరిందన్నమాట," అనుకుంటూ అటక మీద వున్న రవిరాం పళ్ళు కొరికాడు.

కొద్దిసేపు గడిచేసరికి రవిరాంకు అటక మీద ఎర్రచీమల బాధ మొదలైంది. అతడు ఒకటి రెండు నిమిషాలు వాటి బాధ భరించి, యిక ఓర్చుకోలేక అటక మీది నుంచి కిందికి దూకుదామనుకున్నాడు. కాని, అటక చాలా ఎత్తుగా వున్నది. దూకడంలో ఏకాలో, చేయో విరిగినా విరగొచ్చు!

ఇప్పుడేం చేయడమా అని రవిరాం మథనపడుతున్నంతలో, వీధి తలుపు తెరిచిన శబ్దం వినబడింది. అతడికి ప్రాణం లేచివచ్చినట్టయింది. కాని, ఆ వచ్చిన వాడొక దొంగ! వాడు మారుతాళపు చెవితో తలుపు తెరిచి, లోపల గడిపెట్టి, ఇంట్లోకి వస్తూనే దీపం వెలిగించి, పెట్టెలు తెరిచి డబ్బూ, విలువైన వస్తువులూ ఏమైనా దొరుకుతవేమో అని వెతకసాగాడు.

అటక మీద ఒంగి కూర్చుని మెడా, నడుం నొప్పి పెడుతూండగా, ఎర్రచీమలు

కసిగా శరీరాన్ని కుడుతూండగా నరక యాతన పడిపోతున్న రవిరాంకు, ఆ సమయంలో దొంగవాడే ఆపద్బాంధవు డుగా కనిపించాడు.

రవిరాం కాస్త గొంతు సవరించుకుని, "అన్నా, గోడవారగా వున్న నిచ్చెన్ని కొంచెం అటకకు చేరవేస్తావా! ఇక్కడ ప్రాణాలకే ముప్పు కలిగేలా వుంది," అన్నాడు.

దొంగ ఉలిక్కి పడుతూనే అటక కేసి చూసి, అక్కడ వున్నవాడు మరొక దొంగ అయివుంటాడనుకుని, "ఒరే, తమ్ముడూ! నీలాంటి కుర్రకారంతా దొంగ తనాలకు దిగి, మాబోటివాళ్ళ పరువు తీసేస్తున్నారు. దాగడానికి నీకు అటక తప్ప మరేం కనబడలేదా? దిగు, దిగు!" అంటూ నిచ్చెన్ని అటకకు చేరవేశాడు.

రవిరాం బతుకు జీవుడా అనుకుంటూ కిందికి రాగానే దొంగ, "దొరికినదాంట్లో సగం, సగం అన్నావంటే ఒళ్ళు చీరేస్తాను. అటక నుంచి దింపినందుకు మర్యాదగా నాకు, యీ ఇంట దొరికే వస్తువులు మూట గట్టేందుకు సాయపడు," అన్నాడు.

ఇల్లంతా గాలించినా దొంగకు విలువైన వస్తువేదీ కనబడలేదు. వాడు కోపంగా, "తెల్లవారి ఎవడి ముఖం చూశానో ఏమో, యీ దరిద్రుల ఇంటికొచ్చాను," అన్నాడు.

రవిరాంకు మనస్సు చివుక్కుమన్నది. భార్య పెట్టెలో వున్న డబ్బంతా తీసుకు పోయినందుకు చాలా సంతోషించాడు.





దొంగ నిచ్చెన మీదుగా అటక చేరాడు. రవిరాం నిచ్చెనను లాగి, గోడవారగా పెడుతూ, "నువ్వు అనుకున్నట్టు నేను దొంగను కాను, యీ ఇంటి యజమానిని. త్వరలోనే నిన్ను ఖైదుకు పంపుతాను, సరా!" అన్నాడు.

ఇంతలో వీధి తలుపు చప్పుడు కావడంతో రవిరాం వెళ్ళి తలుపు తెరిచాడు. అనూరాధ లోపలికి వస్తూనే, "మీరు ఊరికి వెళ్ళలేదా! తాళం ఎలా తీశారు? ఈరోజు ఎంత ప్రమాదం జరిగిందో తెలుసా," అన్నది ఆయాసపడుతూ.

రవిరాంకు భార్య మాటలు ఏమాత్రం బోధపడలేదు. ఆమె యిలా చెప్పింది:

"మీరు వెళ్ళిన కాస్సేపటికి ఎవడో వచ్చి, మీరు ప్రయాణం చేస్తున్న బాడుగ బండి కాలవలో బోల్తా కొట్టిందనీ, మీకు బాగా దెబ్బలు తగిలాయనీ చెప్పాడు. నేను హడలిపోతూ డబ్బు కొంగున కట్టుకుని, బాడుగ బండిలో ఆ వార్త తెచ్చిన వాడి వెంట బయలుదేరాను. ఆ బండివాడూ, వీడూ తోడుదొంగలు. దారిలో కత్తి చూపి నా దగ్గిరున్న డబ్బంతా గుంజుకున్నారు. ఇంకా నయం, మొన్న ఇంటిల్లిపాదీ పెళ్ళికి వెళుతూ, నా చెల్లెలు నా నగలన్నీ పెట్టుకువెళ్ళింది. లేకపోతే అవీ ఆ దొంగ వెధవల పాలయేవి. డబ్బు పోతే

"కాస్త ఖరీదైన వస్తువు ఏం దొరక్కపోయినా, యీ దరిద్రుల యింట యింత తిండి అయినా దొరికేనా!" అంటూ దొంగ వంటగదిలో వెతగ్గా, అతడికి అన్నం తప్ప మరేం కనబడలేదు.

"ఏ కూరా నారా లేకుండా, యీ చప్పిడి మెతుకులెలా తినడం! వీధి వాకిలి తాళం తప్ప, యీ ఇంట పనికి వచ్చే వస్తువు మరేదీ లేనట్టున్నది; వెళ్ళేప్పుడు అదే తీసుకుపోతాను," అన్నాడు దొంగ.

"అలాగే చేద్దువుగాని. పైన. అటక మీద ఊరగాయల జాడీలున్నవి. వాటిల్లో ఒకటి దింపు; హాయిగా భోజనం చేయొచ్చు," అన్నాడు రవిరాం.

పోయింది, మీరు క్షేమంగా ఇల్లు చేరారు. అదే నాకు పదివేలు.''

అప్పటికిగాని రవిరాంకు రెండు రోజుల క్రితమే! అత్తవారింట్లో అందరూ ఇంటికి తాళం పెట్టి పొరుగూరు వెళ్ళారన్న సంగతి గుర్తుకు రాలేదు. తన క్షేమం కోసం తల్లడిల్లిపోయిన భార్య మీద అతడి కెంతో జాలీ, అభిమానం కలిగాయి. అతడు ఆమె మీద కలిగిన అనుమానంకొద్దీ ఆడిన కపటనాటకమంతా దాచకుండా చెప్పేశాడు.

అనూరాధ నవ్వి, ''నేను రుబ్బుతూ, సగం పచ్చడి రుచి చూసే నెపం మీద చప్పరించేస్తాను. తాలింపు వేసే కూర ఏదైనా వేడిగా వున్నప్పుడే సగంతినేస్తాను. అప్పటికీ మా అమ్మ అంటూండేది - అత్తవారింట్లో కూడా యిలా చేస్తే బావుండదని,'' అన్నది.

ఇదంతా అటక మీద వుండి వింటున్న దొంగ, ''చెల్లెమ్మా, యిలాంటి చిన్న చిన్న దురలవాట్లు నిగ్రహంతో వదుల్చుకోవడం మేలు. అబ్బాయి కూడా ఏదైనా అనుమానం కలిగినప్పుడు సూటిగా అడిగి తేల్చుకోవాలి. అంతేగాని, యిలాంటి డొంకతిరుగుడు నాటకాలాడడం ప్రమాదాలకు దారి తీస్తుంది. అటకకు నిచ్చెన దగ్గిరిగా వుంటేనే ఎవరైనా ఎక్కగలరు, దిగగలరు. అలాగే భార్యాభర్తలు ఒకరి నొకరు అర్థం చేసుకుని చేరువగా వుంటేనే, రేపు వాళ్ళ పిల్లలు సుఖంగా పెరిగి వృద్ధి లోకి వస్తారు,'' అన్నాడు.

తల ఎత్తి అటకమీది దొంగను చూసి అనూరాధ కెవ్వుమన్నది. రవిరాంకు దొంగ మాటల్లో ఎంతో సత్యం వున్నదని పించి, అతణ్ణి గురించి భార్యకు చెప్పి, ''చాలా తెలివీ, లోకజ్ఞానం వున్న దొంగ, భయపడకు!'' అన్నాడు.

తరవాత రవిరాం అటకకు నిచ్చెన వేసి, ''నా కళ్ళు తెరిపించిన నువ్వు, దొంగవయినా, మా అతిథివి. హాయిగా భోజనం చేసి వెళుదువుగాని, ఒక ఊరగాయ జాడీతో కిందికి దిగిరా!'' అన్నాడు.



# సన్యాసి బేరం!

ఒక కొండ మీద సన్యాసుల మఠం వున్నది. ఆ ప్రాంతాలకు కొత్తగా మామిడిపళ్ళు అమ్మడానికి వచ్చిన యువకుడొకడు, సన్యాసులేమైనా పళ్ళు కొంటారేమోనని, నానా అవస్థ పడి కొండెక్కి వెళ్ళి, అక్కడ కనిపించిన ఒక యువ సన్యాసితో, "అయ్యా, సంవత్సరంలో ఒక్కసారి మాత్రమే లభించే మామిడిపళ్ళు తెచ్చాము, కొంటారా?" అన్నాడు.

ఆ యువ సన్యాసి చాలా భూతదయ కలవాడు; కాని అమాయకుడు. అతను పళ్ళ కుర్రవాడికేసి జాలిపడుతూ చూసి, "ఇవాళ్టికేం ఒద్దు," అన్నాడు.

కర్మకొద్దీ యింత కొండ ఎక్కి వచ్చానే అనుకుంటూ మామిడిపళ్ళవాడు ఉసూరు మంటూ కొండ దిగాడు. ఆ సమయంలో యువ సన్యాసి పైనుంచి, "కొండపైకి రా!" అంటూ కేక పెట్టాడు.

సన్యాసులు మామిడిపళ్ళు కొనదలిచారులా వుందనుకుంటూ పళ్ళ యువకుడు రొప్పుతూ మరొకసారి కొండ ఎక్కాడు.

యువ సన్యాసి వాడికేసి మరింత జాలిగా చూస్తూ, "ఇవాళ్టికే కాదు, మామిడిపళ్ళు రేపటికి వద్దు. పాపం, అనవసరంగా శ్రమపడి వస్తావని ముందే చెబుతున్నాను," అన్నాడు.

—ఎం. డి. సౌజన్య





# విఘ్నేశ్వరుడు

గృహద్వారాన్ని మూసి ఉన్న కొండంత రాతిని గులకరాయి లాగ తొండంతో లాగేసి, గజరాజు లోపలికివెళ్ళి కొంత సేపయ్యాక రత్నాల నగలను కట్టలు కట్టలుగా తొండంతో తీసుకొచ్చి సౌదామిని ముందు కుప్పవేసింది. చంద్రహారాల్నీ, కంఠాభరణాల్నీ ఆమె మెడనిండా వేసి, తండ్రి బిడ్డను బుజ్జగించి చెప్పినట్లుగా వీపునిమిరి, మిగతా నగలను ధరించినన్ని ధరించి, తక్కినవి మూట గట్టుకొని తీసు కెళ్ళమని సైగచేసి చెప్పింది.

సౌదామిని అలాగే చేశాక, ఏనుగు ఆమెను అరణ్యం దాటించి కళ్యాణినగర సమీపాన విడిచి, అరణ్యంలోకి వెళ్ళి పోయింది.

బంగారు విగ్రహం లాగ నగలతో తళుక్కు, తళుక్కున దేదీప్యమానంగా మెరుస్తున్న కోడలిని చూసి కలహకంఠి నిర్ఘాంతపోయి, సంబాళించుకొని, మెల్ల మెల్లగా ఆ నగలన్నీ ఎలాగ వచ్చాయో చెప్పేవరకూ వేధించి, సౌదామిని చెప్పిన దంతా విని, ''ఏనుగకి వెలగపళ్ళు అంత ఇష్టమన్న మాట!'' అని తల పంకించి, వెంటనే సంతకు వెళ్ళి సంచినిండా వెలగ పళ్ళు కొనుక్కువచ్చింది.

నగలు నింపుకొని రావడానికి ఒక గట్టి గోతాన్ని భుజాన వేసుకొని, వెలగపళ్ళ సంచితో కలహకంఠి బయలుదేరింది.

అరణ్యం ప్రవేశించి కోడలు చెప్పిన గుర్తుల ప్రకారం ఎంత వెతికినా వెలగ



చెట్టు కనపడక విసిగి, ఒక చింతచెట్టు కింద చతికిలబడి, తినాలని వెలగపండు తీసింది.

తినాలనే తీసినా ఎలాగో నిగ్రహించు కొని, వెలగపండు చేత్తో ఎత్తి పట్టుకొని, గొంతు సవరించుకొని,

''ఏనుగా రా రావే!
వెలగపళ్ళు తినవే!
నగలెన్నో తేవే!
నా కోర్కె తీర్చవే!
ఏనుగా రా!
వేగంగా రా!''—అంటూ భజనపాట మొదలుపెట్టింది. పాట సాగుతున్నది, ఏనుగు రాలేదు గాని, అడవి దద్దరిల్లేలాగ గాండ్రుమనే అరుపు వినిపించింది. అది ఏనుగు ఘీంకారం కాబోలు అనుకొని కలహకంఠి సంతోషపడుతూ మెడచాచి చూడగా, పెద్దపులి దూకుతూ రావడం కనిపించింది.

భుజం మీది గోతాన్ని వదలకుండా కలహకంఠి తిరిగి చూడకుండా పరుగెత్తి, పరుగెత్తి రొప్పుతూ పడిపోయింది. ఆ పడడం సరిగా గుహ దగ్గిరే పడింది. గుహ తెరిచే ఉంది. తన అదృష్టానికి కలహకంఠి పొంగిపోతూ గుహలోకి వెళ్ళింది.

గుహలో కుప్పలు తెప్పలుగా ఉన్న నగలు చూసి పిచ్చెత్తినదానిలాగ తల మునిగేలాగ నగలన్నీ వేసుకొని, గోతం నిండా నగలు కుక్కి మూతి కట్టి, ఎత్త లేక ఎత్తి, మోయలేక మోస్తూ, నడవలేక నడుస్తూ గుహ మొదటికి వచ్చేసరికి గుహ మూతబడి ఉంది. ఎదురుగా చీకటిలో ఎర్రగా మెరుస్తున్న కళ్ళతో, తెల్లగా మెరుస్తున్న కోరపళ్ళతో పగలబడి నవ్వు తున్న పెద్ద బ్రహ్మరాక్షసి చీకటిలో చీకటి లాగ కనిపించింది.

ఆ భూతం ప్రతిధ్వనితో గుహ కంపించిపోయేలాగ, ''ఓహ్హో! కలహ కంఠీ! నువ్వు కోడలిని కాల్చుకుతినే అత్తవైతే, నేను అత్తను చిత్రహింసతో

తినేసిన కోడల్నీ! నా చరిత్ర విను!'' అంటూ చెప్పడం ప్రారంభించింది:

వెనకటికి నేను చురకత్తిలాంటి అందకత్తెను. అమ్మా, నాన్నా పెట్టిన కలహంసి; కాపురానికెళ్ళాక, నా నోటి ప్రతాపానికి ఆ పేటంతటికీ నేను సంపాదించుకొని సార్థకపరుచుకొన్న పేరు కలహదుందుభి.



నువ్వెంత చెడ్డ అత్తవో, కలహకంఠీ! నా అత్త అంత ఉత్తమురాలు, పరమ సాధువు.

నేను కాపరానికివెళ్ళి ఏడాది తిరక్కుం డానే నా మొగుడు ఇల్లు విడిచి దేశాల పాలయ్యాడు. అంటే నేనెంత ఉత్తమ ఇల్లాలినో ఊహించుకో! నాకు నగలపిచ్చి ఇంతా అంతా కాదు. బంగారుపంటలు పండే భూములు పుట్రలు అమ్మించి నగలు చేయించుకున్నాను. మా అత్త ముక్కు పుల్ల నుంచి అన్నీ నాకే యిచ్చేసింది.

అటువంటి అమాయకురాలైన అత్తను, ఒక పూటైనా సరిగా తిననిచ్చేదాన్నిగాను. చిక్కిశల్యమైన వృద్ధురాలి చేత ఇంటి చాకిరీ అంతా చేయించేదాన్ని.

చివరికి నా అత్త, మామ విసిగిపోయి వాతాపిక్షేత్రంలోని విఘ్నేశ్వరుని దర్శించి అక్కడే కన్ను మూద్దామని బయలు దేరారు. నా అత్త చేతుల్లో ఉన్న చిన్న మూట చూసి అదేమిటని దూకుడుగా దాన్ని లాక్కోవడంలో, ఆవిడ తూలి పడిపోయి, ఆయాసంతో రొప్పుతూ కన్ను మూసింది.

అంతవరకూ ఎంతో సహనంతో నా అత్యాచారాలన్నీ చూస్తూ పల్లెత్తు మాట అనని నా మామగారు, ఆపలేని దుఃఖంతో, పైకుబికిన కోపంతో, ''పాపిష్ఠిదానా! నువ్వు మా కోడలివైపోయినావు, లేకుంటే శపించేవాణ్ణి! ఎప్పటికైనా, మా ఒక్క గాని ఒక్క కొడుకు తిరిగి వస్తాడనీ, నువ్వు వాణ్ణి సుఖపెట్టగలవనే ఆశతో, అన్నీ సహించాము; కడసారి కోరు తున్నాను-వాడొస్తే సరిగా చూడు!'' అని



చెబుతూ అలాగే ప్రాణాలు విడిచి భార్యతోనే సహగమనం చేశాడు. ఆయన గొప్ప నిష్ఠాపరుడు, తపశ్శాలి.

అదే సమయంలో, ఒక సన్యాసి అక్కడికి వచ్చాడు. నా అత్తమామల మృత దేహాలపైబడి రోదిస్తూ, నేను లాక్కొబోయేటప్పుడు కిందపడిన మూటను తీసి విప్పాడు. అందులో రెండు చిరుగుల బట్టలు తప్ప మరేమీ లేవు.

ఆ సన్యాసి నన్ను వజ్రాల్లాంటి కళ్లతో కాల్చేస్తున్నట్టు చూస్తూ, ''నువ్వు బ్రహ్మరాక్షసిగా పుట్టవలసినదానివి!'' అని అన్నాడు. అంతే, తర్వాత వృద్ధ దంపతుల ఉత్తరక్రియలు జరిపి వెళ్లిపోయాడు.

ఆ సన్యాసి ఎవరో కాదు, నా రూపవిలాసాలకి పరవశించి కోరి చేసుకున్న నా భర్తే! అని బ్రహ్మరాక్షసి చెప్పి కాస్సేపాగి మళ్ళీ చెప్పసాగింది:

నా నగల పిచ్చి, ధన వ్యామోహం నన్ను ఎంతవరకు ఈడ్చుకు వచ్చాయంటే, నేను కొంతమంది గజదొంగలను చేరదీశాను. దొంగల రాణిని అనిపించుకున్నాను. ఈ గుహలోనే దొంగలు గొప్ప గొప్ప నగలను ధనరాసులను పోగు పోస్తూండేవారు. అంతా నా స్వంతం చేసుకోవాలని దొంగలకు విషభోజనం పెట్టాను. వాళ్లు చచ్చే ముందు చావు తెగింపుతో కసిగా నన్ను ఇందులో ఉంచి గుహను పెనుబండతో కప్పేశారు.

కలహకంఠీ! ఇదే గుహలో, ఆ నగల్నీ, ధనరాసుల్నీ చూసుకుంటూ అలాగే మాడి మాడి కన్ను మూసి, ఇలాగ భూతాన్నయి పడి ఉన్నాను. నీకు బుద్ధి వచ్చేలాగ చేస్తే, నా పిశాచజన్మ శాపం తీరిపోతుందని గుహలోకి వచ్చిన ఏనుగు వలన తెలిసింది.

ఏనుగు నీ కోడలికి ఇచ్చినవన్నీ అసలు నగలే; ఇప్పుడు నువ్వు పెట్టుకున్నవీ, అత్యాశకొద్దీ పోగు చేసి గోతాం నిండా కట్టుకున్నవీ ఏమిటో చూసుకో! అన్నది బ్రహ్మరాక్షసి.




కలహకంఠి భుజానికెత్తుకొన్న గోతం కట్టువిడి దాంట్లోంచి పాములూ, జెర్రులూ, కొండ తేళ్ళూ ఊడిపడుతూ జరజరా గుహ నలుమూలలకూ పాకాయి.

ఒంటి మీద పాములూ, తేళ్ళూ పాకుతూంటే బెంబేలు పడిపోతున్న కలహకంఠిని చూసి గుహ మారుమ్రోగుతూండగా బ్రహ్మరాక్షసి వికవికా నవ్వుతూ, "నువ్వు కోడలిని కాల్చుకు తినే కలహకంఠివి. నేను అత్తమామల ఉసురుపోసుకున్న కలహదుందుభిని! ఉత్తమురాలైన నీ కోడల్ని మంచిగా చూసుకొంటే సరేసరి, లేదా ఈ గుహలో నాలాగ బ్రహ్మరాక్షసివై పడి ఉండటం ఇహ నీ వంతు అవుతుంది! విన్నావా, కలహకంఠీ!" అని చెప్పింది.

కలహకంఠి లెంపలువేసుకొని, రాక్షసికి దణ్ణం పెట్టి, "బుద్ధి వచ్చింది, కోడల్ని కూతుర్లాగ చూసుకుంటాను. గుహ నుంచి నన్ను బయట పడనిచ్చి, అరణ్యం దాటించు!" అని మొరపెట్టింది.

బ్రహ్మరాక్షసి కలహకంఠిని అడవి దాటించి కళ్యాణినగరం పొలిమేరకు చేర్చి, "మాట తప్పావో, బ్రహ్మపిశాచివై గుహలో ఉంటావు, జాగ్రత్త!" అని హెచ్చరించి భగ్గుమని మండిపోయి అదృశ్యమైంది.

కలహకంఠి బ్రతుకు జీవుడా అని ఇంటికి బిరబిరా వెళ్ళి, సౌదామిని ముందు మోకరిల్లి, మోకాళ్ళు పట్టుకొని, "అమ్మా, సౌదామినీ! నన్ను మన్నించు. కొడుకూ, కోడలూ చిలకాగోరువంకల్లాగ ఉంటే చూసి సంతోషించడం కంటే నాకు కావల్సిందేమీ లేదు!" అన్నది.

అత్త పరివర్తనానికి కారణం విఘ్నేశ్వరుని కటాక్షం అని సౌదామిని సంతోషించింది. కలహకంఠి తిరిగి కలకంఠి అనిపించుకొన్నది.

పావనమిశ్రుడు కథను ముగించి, "పిల్లలూ! ఏనుగ ఎవరో చెప్పుకోండి చూదాం!" అన్నాడు.

పిల్లలే కాకుండా, పెద్దలు కూడా ఆనందోత్సాహాలతో గొంతెత్తి, "విఘ్నేశ్వరుడు! మన విఘ్నేశ్వరుడే!" అంటూ గొల్లున లేచి ప్రసాదం తీసుకొని ఇళ్లకు వెళ్లారు.

ఆలయమంటపంలోని కుడ్యచిత్తరువులకు సంబరధరచిన కథలను, రోజూ పావనమిశ్రుడు చెబుతూంటే, వీనుల విందుగా వింటూన్న పిన్నల, పెద్దల మనస్సులనిండా, విఘ్నేశ్వరుడిపై బలమైన భక్తి వర్ధిల్లింది.



ఒకనాడు ఒక సంగీత కళాభిమాని, ఒక కుడ్యచిత్తరువులో తంబుర మీటుతూ ఒక విద్వాంసుడు గానం చేస్తూంటే, వివిధ భంగిమల్లో విఘ్నేశ్వరుడు నృత్యం చేస్తూండడం చూసి, ఆ చిత్ర చరిత్ర చెప్పమని కోరాడు; పావనమిశ్రుడు చెప్పడం మొదలుపెట్టాడు:

వాతాపినగరం కళలకు కాణాచిగా కవిపండిత, గాయక, విద్వాంసులకు పుట్టినిల్లై విలసిల్లుతూన్నది.

గజానన పండితుడు నగరంలో అగ్రగణ్యుడు, బహుముఖ ప్రజ్ఞాశాలి; ముఖ్యంగా గొప్ప గాయకుడు. అతని గాత్రంలో సమ్మోహన శక్తి ఉండేది. వాతాపి గణపతిపై ఎన్నెన్నో కీర్తనలు రచించి పాడుతూండేవాడు. అతని మనుమడు బాలగణేశభట్టు టింగుటింగున తాళాలు వాయిస్తూండేవాడు.

గజాననుడు 'ధిమికిట ధిమికిట తాండవ నృత్యకరీ గజానన....' అనే పల్లవిని ఎత్తుకొని రాగాలు మారుస్తూ, అనేక రాగాల్లో పాడుతూంటే, గజాననుడైన విఘ్నేశ్వరుడు ఇంద్రధనుస్సు రంగుల్లో అనేక రూపాల్లో నర్తిస్తూ శ్రోతల కన్నులకు కట్టేవాడు.

హంసధ్వనిరాగంలో తెల్లని రాజహంస లాగ, మాయామాళవ రాగంలో ఉదయ రవి బింబంలాగ, భైరవిరాగంలో ఎర్ర తామరలాగ, హిందోళరాగంలో నీలాకాశం లాగ, నీలాంబరిరాగంలో నీలికలువలాగ,

ఆనందభైరవిరాగంలో అరవిచ్చిన తెల్ల కలువలపై విరిసిన పున్నమి వెన్నెలలాగ విఘ్నేశ్వరుడు లీలగా కనిపించేవాడు.

గజానన పండితుడికి సత్కారాలమీద, సన్మానాలమీద కాంక్ష ఏ కోశానా లేక పోయినా, అత్యున్నత సత్కారమైన బంగారు గణేశ ప్రతిమ అతనికే ప్రతి సంవత్సరం వస్తూండేది. ఆ ప్రతిమలతో అతని ఇల్లు నిండిపోయింది.

దేశాంతరంగా చాలామంది మహామహ విద్వాంసులకే గజానను డంటే ఎనలేని గౌరవమూ, గురుభావమూ ఉంటున్నా, వాతాపినగరంలో కొంతమందికి అతనిపై అసూయ బాగా పెరిగింది. వారందరికీ నాయకుడు స్వరకేసరి.

స్వరకేసరి ఎప్పుడూ విద్వత్తు చూప డానికి గొప్ప తాపత్రయ పడేవాడు. అతను గళం విప్పితే సింహగర్జనలు వెలువడేవి. మద్దెల వాయించేవాడిని ముప్పతిప్పలు పెడుతూ వీరవిహారం చేస్తూన్నట్లు పాడే వాడు. గజాననపండితుడికి అటువంటి విద్వత్తు ప్రదర్శించుకోవాలనే యావ లేక పోవడమే కాకుండా, విఘ్నేశ్వరుడిపై భక్తితో తన్మయావస్థలో పడి తాళం తప్పుతూ, మరొకప్పుడు పాడుతూ, పాడుతూ మూగబోతూండేవాడు. అటు వంటి సందర్భాలను స్వరకేసరి ప్రభృతులు గజాననుడికి శాస్త్రపాండిత్యం లేదనీ, కేవలం అతనిది మనోధర్మగాన మనీ గాలిపాట అనీ హేళనగా ప్రచారం చేస్తూ, అక్కసు తీర్చుకుంటూండేవారు. గజాననుడికి ఎవరేమన్నా, ఏమను కుంటూన్నా ఆ ధ్యాసే ఉండేది కాదు. మనసులోని విఘ్నేశ్వరుడితో ఏకాంతంలో మంతనాలాడుకొంటున్నట్లు పాడేవాడు. అందులో ఏదో అనిర్వచనీయమైన శక్తి వింటున్నవారిని మైమరపించి దివ్యలోకా ల్లోని ఆనంద సాగరాల్లో ముంచి తేల్చేది.

ఏ విధంగానైనా ఆ సంవత్సరం స్వర్ణ గణేశ విగ్రహం గజానన పండితుడి ఇల్లు చేరకుండా చేయడానికి స్వరకేసరి బాగా ఆలోచించి, ఒక గొప్ప పథకం వేశాడు.






## 10

నూరల్ హుదా ఇదే విధంగా తన చెల్లెళ్ళను ఒకరొకరినే లోపలికి రప్పించి, హసన్‌కు చూపి, ''నీ భార్య ఈమేనా?'' అని అడిగింది. అయిదుగురయారు. అందరిని గురించీ హసన్ మొదట చెప్పినట్టే చెప్పాడు. ఇంక హసన్ భార్య మాత్రమే మిగిలి ఉన్నది. ఆమెను ప్రవేశపెట్టమని నూరల్‌హుదా ముసలిదానికి ఉత్తరువిచ్చింది. గంధర్వచక్రవర్తి కడగొట్టు కుమార్తె లోపలికి వచ్చింది. ఆమెను చూస్తూనే హసన్ కెవ్వున అరిచి విరుచుకుపడిపోయాడు. ఆమె కూడా అతన్ని గుర్తించి తన అక్క కూచుని ఉన్న సింహాసనం చెంత మూర్ఛపడిపోయింది.

నూరల్‌హుదా ఇక తన ఈర్ష్యను అణుచుకోలేక, ''ఆ మనిషిని పట్టుకుపోయి నగరం వెలపల పారెయ్యండి!'' అని ఆడభటులను ఆజ్ఞాపించింది. వారు హసన్‌ను సముద్రతీరాన పారేశారు.

హసన్ భార్యకు స్పృహ రాగానే నూరల్‌హుదా ఆమెతో, ''సిగ్గు మాలినదానా! పాపాత్మురాలా! ఆ మనిషికీ, నీకూ ఏమిటి సంబంధం? నాన్నకు తెలియకుండా వాడికి భార్యవై, తరవాత వాణ్ణి విడిచిపెట్టి వచ్చి. రెండందాలా పతితవైనావు. నీ వంశానికి నీవు తెచ్చిన మచ్చను నీ రక్తంతోనే కడిగెయ్యాలి,'' అని దాసీలను, ''ఈ పాపాత్మురాలిని గుంజకు కట్టేసి, నెత్తురు వరదలై పారేదాకా కొట్టండి!'' అని ఆజ్ఞాపించింది. ఆ తరవాత ఆమె తన తండ్రికి ఒక లేఖ రాసింది. అందులో తన ఆఖరు చెల్లెలి కథ అంతా వివరించి, తాను ఆమెకు ఇవ్వబోయే శిక్ష తెలిపి, ఆయన అనుమతి



శీఘ్రంగా కావాలని కోరింది. ఆ లేఖను ఒక దూత ద్వారా తండ్రికి పంపింది.

ఆ లేఖ చూడగానే చక్రవర్తి కళ్ళకు చీకట్లు కమ్మాయి. కాని ఆయన దానికి జవాబిస్తూ, "నీ చెల్లెలు చేసిన పాపానికి తగిన శిక్ష అంటూ లేదు. ఆమె ప్రాణ దండన ఎలా విధిస్తావో నీవే నిర్ణయించి, అమలు చెయ్యి." అని చెప్పాడు.

హసన్‌కు స్పృహ తెలిసేసరికి అతను సముద్ర తీరాన ఉన్నాడు. అతని కిప్పుడే ఆశా లేదు. అతను వెర్రివాడిలాగా లేచి దిక్కు లేకుండా నడవసాగాడు.

అతనలా నడిచి వెళుతుంటే ఒక చోట ఇద్దరు ఆడపిల్లలు, పన్నెండేళ్ళ వయసు వాళ్ళు ఒక కుళాయి కోసం పెనగులాడుతూ కనిపించారు. అది తోలుతో చేసినది. దాని మీద ఏవో అక్షరాలూ, అలంకారాలూ ఉన్నాయి. అతను ఆ పిల్లలను, "ఎందుకు కీచులాడుకుంటున్నారు?" అని అడిగాడు.

ఆ కుళాయి కోసం వాళ్ళు పోట్లాడుకుంటున్నారు. నాకు దొరికిందంటే, నాకు దొరికిందంటున్నారు. "మీ తగాదా నేను తీరుస్తాను. నేనొక రాయి విసురుతాను. మీలో ఎవరు ముందు పరిగెత్తి వెళ్ళి ఆ రాయిని తీసుకొస్తే వాళ్ళది కుళాయి! సరేనా?" అన్నాడు హసన్.

హసన్ ఒక రాయి బలం కొద్దీ విసిరాడు. పిల్లలిద్దరూ దానికోసం పరిగెత్తారు. వాళ్ళు తిరిగి వచ్చేదాకా టోపీ తన నెత్తిన పెట్టుకుని హసన్ అక్కడే నిలబడ్డాడు. త్వరలోనే ఇద్దరు పిల్లలూ తిరిగి వచ్చారు. ఒకతె చేతిలో రాయి ఉన్నది. "ఇదుగో, నేను గెలిచాను. నువ్వెక్కడున్నావు?" అన్నదా పిల్ల. ఇద్దరూ తన కోసం దిక్కులు చూస్తూండటం గమనించి హసన్ ఆశ్చర్యపోయాడు. "వాళ్ళు గుడ్డివాళ్లు కారే, ఎందుకలా దిక్కులు చూస్తారు? నేనిక్కడే ఉంటినిగా?" అనుకున్నాడు. "నేనిక్కడే ఉన్నాను!" అని వాళ్ళను కేక పెట్టాడు.

కేక వచ్చిన దిక్కుగా చూశారు పిల్లలు. కాని వాళ్లకేమీ కనిపించక పోయేసరికి భయపడి సన్నగా ఏడుపు సాగించారు. హసన్ వాళ్ళను తాకి, "ఎందుకర్రా ఏడుస్తారూ?" అన్నాడు. దాంతో వాళ్లకు మరింత భయం కలిగి కాలిసత్తువ కొద్దీ పారిపోయారు.

"అరె, ఇది మంత్రపు కుళాయిలా గుంది. ఇది నెత్తిన పెట్టుకుంటే అదృశ్యమవుతారు కాబోలు!" అనుకున్నాడు హసన్. ఇప్పుడు తాను రహస్యంగా వెళ్ళి తన భార్యను చూడవచ్చు. అతనికి నృత్యం చెయ్యాలన్నంత ఆనందం కలిగింది. అతను వెంటనే బయలుదేరి నగరానికి వెళ్ళి ముసలిదాని కోసం వెతికాడు. ఆమె ఒక గదిలో కట్టి పడేసి ఉన్నది. తాను అదృశ్యంగా ఉన్నదీ లేనిదీ రూఢిగా తెలుసుకోవటానికి అతను ఆ గదిలో ఒక పక్కన పేర్చి ఉన్న పింగాణీ జాడీలలో ఒకటి ఎత్తి నేలకు గట్టిగా విసిరి పెద్ద చప్పుడయేలాగా పగలగొట్టాడు. ముసలిది అటూ ఇటూ చూసి, ఎవరూ కనపడక, "ఓ భూతమా, ఎవరు నీవు?" అని కేకపెట్టింది భయంతో.

"నేను భూతాన్ని కాదు, హసన్‌ను, నిన్ను విడిపించటానికి వచ్చాను," అంటూ హసన్ నెత్తిమీది నుంచి కుళాయి తీశాడు.



"అయ్యో, హసన్! నీ వెంత దౌర్భాగ్యుడివి! మా రాణి నిన్ను ప్రాణాలతో వదిలినందుకు పశ్చాత్తాప పడి, నిన్ను పట్టుకురమ్మని భటులను పంపింది. అందుచేత నీవు ఇక్కడ తారట్లాడక సాధ్యమైనంత వేగంగా పారిపో," అన్నది ముసలిది. ఆమె అతనితో అతని భార్యకు జరగబోయే శిక్షను గురించి కూడా చెప్పింది.

"నన్నూ, నా భార్యనూ, నిన్నూ కూడా దేవుడే కాపాడతాడు. ఈ కుళాయి చూడు. ఇది మంత్రశక్తి కలది. దీన్ని నెత్తిన పెట్టుకుని ఎక్కడికైనా పోగలను. నన్నెవరూ చూడలేరు," అన్నాడు హసన్.



ముసలిది ఈ మాట విని పరమానందం చెంది, ''అయితే నన్ను విడిపించు. నీ భార్యను బంధించిన చోటు చూపుతాను,'' అన్నది. హసన్ ఆమె కట్లు విప్పి, తన నెత్తిన కుళాయి పెట్టుకుని ముసలిదాని చెయ్యి పట్టుకున్నాడు. వెంటనే ఆమె కూడా అతనితోబాటు అదృశ్యమయింది.

ముసలిది అతన్ని ఒక చీకటి కొట్టు వద్దకు తీసుకుపోయింది. హసన్ భార్య అందులోనే బంధించి ఉన్నది. ఆమె చిత్రహింస అనుభవించటానికి ఎదురు చూస్తూ అతి దీనస్థితిలో ఉన్నది. అతను ఒక్కసారిగా తన భార్య ఎదటపడి ఆమెను కంగారు పెట్టకూడదని అనుకుని కూడా ఆమె దైన్యాన్ని చూసి సహించలేక, తన నెత్తిమీది కుళాయి తీసేసి ఆమెను ఆలింగనం చేసుకున్నాడు. ఆమె తన భర్తను చూస్తూనే మూర్ఛపోయింది.

హసన్ ఆమె బంధాలు తెంచి, ముసలిదాని సహాయంతో ఆమెకు మూర్ఛ తెలిసేటట్టు ఉపచారాలు చేశాడు. ఆమె మెల్లిగా కళ్లుతెరిచి, ''నీవు ఆకాశంనుంచి దిగావో, భూమిలో నుంచి పైకి వచ్చావో నాకు తెలీదు. నా కర్మకు నన్ను విడిచి త్వరగా వెళ్ళిపో. విధిని ఎవరు తప్పించగలరు? నా అక్క నన్ను చిత్రవధ చేయిస్తుంటే నీవు చూడలేవు,'' అన్నది.

''పిచ్చిదానా, నిన్ను బాగ్దాదుకు తీసుకుపోవటానికి వచ్చాను,'' అన్నాడు హసన్.

ఆమె నమ్మక, ''నీకు పిచ్చిలో కూడా సాహసం పోలేదు,'' అన్నది.

''నిన్నూ, ఈ ముసలిదాన్నీ వెంట తీసుకోకుండా నే నీ భవనం నుంచిపోను. ఈ కుళాయి చూడు,'' అంటూ దాని ప్రభావం తన భార్యకు ప్రదర్శించి చూపాడు హసన్.

హసన్ భార్య ఆనందంతోనూ, పశ్చాత్తాపంతోనూ కన్నీరు కార్చుతూ, ''నీ కష్టాలన్నిటికీ మూలం, నేను బాగ్దాదు నుంచి వచ్చెయ్యటమే. నేను చేసిన పాపు

పని ఏమిటో నాకు తెలుసు. కనక, నన్ను పనిపెట్టుకుని నిందించవద్దు,'' అన్నది.

''కాదు, నిన్ను నా వెంట తీసుకు పోకుండా బాగ్దాదులో విడిచి వెళ్ళటమే నా తప్పు, ఇక ఎన్నటికీ అలాటి పని చెయ్యను,'' అన్నాడు హసన్.

అతను కుళాయి నెత్తిన పెట్టుకుని ఒకచేత భార్యనూ, రెండవచేత ముసలి దాన్నీ పట్టుకునేసరికి ముగ్గురూ అదృశ్యులయారు. ఆ స్థితిలో వారు రాజభవనం నుంచి ఎవరికీ కాన రాకుండా బయట పడి, హసన్ భార్య తన బిడ్డలను రహస్యంగా దాచి ఉంచిన చోటికి వెళ్లారు. నాసిర్‌నూ, మన్సూర్‌నూ చూడగానే హసన్ తండ్రి హృదయం పొంగిపొర్లింది.

ముసలిది బిడ్డలిద్దరినీ తన భుజాల పైన ఎక్కించుకున్నది. తరవాత హసన్ భార్య అదృశ్యంగా వెళ్ళి మూడు పక్షి తొడుగులు దొంగిలించి తెచ్చింది. పెద్ద వాళ్ళు ముగ్గురూ వాటిని ధరించి, భయంకరమైన వాక్-వాక్ దీవుల నుంచి శాశ్వతంగా ఎగిరిపోయారు.

వారు ఏకంగా బాగ్దాదులో హసన్ ఇంటి డాబాపై వాలి, మెట్ల మీదుగా కిందికి దిగి హసన్ తల్లి ఉన్న చోటికి వచ్చారు. ఆమె అసలే వృద్ధురాలు. ఏడిచి ఏడిచి ఆమెకు దృష్టి కూడా సరిగా లేకుండా పోయింది. దిక్కులేని ఆ వృద్ధురాలు అవసానదశలో ఉన్నది. హసన్ ఆమె గది తలుపు తట్టి, ''అమ్మా, తలుపు తియ్యి! శుభవార్త!'' అనగానే ఆమె ఒక్క పరుగున వచ్చి తలుపు తీసి, తన కొడుకునూ, కోడలినీ, మనమలనూ, ముసలిదాన్నీ చూసి, ఆనందోద్రేకం పట్టలేక మూర్ఛపోయింది.

హసన్ తన తల్లికి ఉపచారాలు చేసి స్పృహ తెప్పించాడు. అతని భార్య ఆమెకు తన తప్పుకు క్షమాపణ చెప్పుకున్నది. జరిగిన విచిత్ర సంఘటనలన్నీ హసన్ తల్లికి చెప్పాడు. తరవాత అందరూ సుఖంగా ఉన్నారు. —(అయిపోయింది)



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1982 సెప్టెంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.







Devidas Kasbekar — P. C. Dhir

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ జూలై నెల 20 వ తేదీలోగా వ్యాఖ్యాలు మాకు చేరాలి. తరవాత చేరే వ్యాఖ్యాలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యాలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 25/–లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :– చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

## మే నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ఇవి ఎన్ని వేళ్ల?

రెండవ ఫోటో : ఎక్కడున్నాయి నీళ్ల!

పంపినవారు : వి. గోపీకృష్ణ, ఖండవల్లి. (ప॥ గోదావరి జిల్లా)

బహుమతి మొత్తం రు. 25/–నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.

అదనపు బలంతో కూడిన సంపూర్ణ శక్తియుతమైనవి రుచికరమైనవి

క్వాలిటీ గ్లూకోజ్
శక్తి నిచ్చేవి కమ్మని రుచికరమైనవి






CAS/KBPL/81127

క్వాలిటీ గ్లూకోజ్ బిస్కట్లు ఆధునిక పద్ధతిలో మేలురకమైన మిశ్రమ పదార్థాల మేలు కలయికతో తయారు చేయబడినవి. అత్యున్నత ప్రమాణాలు కలిగినవి. కరకరలాడేవి మరియు పుష్టికరమైనవి.

క్వాలిటీస్
గ్లూకోస్ బిస్కత్తులలో బంగారం




క్వాలిటీ
బిస్కట్స్ ప్రై. లి.
బెంగుళూరు-560 039.

69







వారెవ్వా! వహ్వా!
ఇదేమరి గోల్డ్‌స్పాటింగ్ రోజు!




గోల్డ్‌స్పాటింగ్‌తో వహ్వా...
మజాయే మజా!

I am
a
Goldspotter
too!





రామ్, శ్యామ్

# వెండి చారలు

ఇంటర్వెల్‌లో రావాల్సింది మజాపారుకాని,
కడుపునొప్పి కాదు.




























పార్లే పాపిన్స్ మజాగా నోట్లో వేసుకు నేముందర వెండిచారలకోసంచూడండి.
ఇప్పుడు నకిలీచేసేవాళ్ళు మిమ్మల్నిమోసం చేయలేరిక.